శ్రీరస్తు.

కంచెర్ల గోపకవి ప్రణీతంబగు

# దాశరథీశతకము



టీకాతాత్పర్య సహితము.



పబ్లిషర్సు :

లలితా అండ్ కో., ఏలూరు.

బ్రాంచెస్ :- తెనాలి — తోట్లవల్లూరు.

---

శ్రీ సీతారామాంజనేయ ప్రెస్, ఏలూరు.

1948

 [వెల 8 అణాలు.

శ్రీరస్తు.

కంచెర్ల గోపకవి ప్రణీతంబగు

# దాశరథీ శతకము



టీకా తాత్పర్య సహితము.




లలితా అండ్ కో., ఏలూరు.

బ్రాంచెస్ :- తెనాలి — తోట్లవల్లూరు.

1948

[వెల 8 అణాలు



# శ్రీ ర స్తు.

# దాశరథి శతకము.



శ్రీరఘురామ, చారుతుల ♦ సీదళదామ, శమక్షమాది శృం
గార గుణాభిరామ, త్రిజ ♦ గన్నుత శౌర్యరమాలలామ దు
ర్వారకబంధరాక్షస ♦ విరామ, జగజ్జన కల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 1

టీ. శ్రీ = సంపద్యుక్తుఁడైన, రఘు = రఘుమహారాజుయొక్క, ఇక్ష్వాకువంశమునందు కూటస్థపురుషుఁడైన, రఘుమహారాజుయొక్క కులమున పుట్టినట్టి, రామ = రామ, చారు=మనోహరమైన, తులసీ=తులసియొక్క, దళ = పత్రముచేతనైన, దామ = దండగలవాఁడా, శమ=శాంతి, క్షమ= ఓర్పు ; ఆది = మొదలైన, శృంగార=మనోజ్ఞములగు, గుణ=గుణములచేత, అభిరామ = మనోహరుఁడైనవాఁడా త్రిజగత్ = మూఁడులోకములచేత, నుత = పొగడఁబడిన, శౌర్య = పరాక్రమముయొక్క, రమా = సంపత్తి యనెడి, లలామ = అభరణముగలవాఁడా, శౌర్యరమా = పరాక్రమ లక్ష్మి చేత, లలామ = మనోజ్ఞుఁడైనవాఁడా, దుర్వార = వారింపరాని, కబంధ రాక్షస = కబంధుఁడను రాక్షసుని, విరామ = హరించినవాఁడా, జగత్ =

లోక ... ంచలి, జన=జనులయొక్క, కల్మష=పాపముల నెడి, అర్ణవ=సముద్ర ములను, ఉత్తారక = దాటించునట్టి, నామ = పేరుగలవాఁడా, కరుణా పయోనిధీ=దయా సముద్రుఁడును, భద్రగిరి=భద్రాచలమందు నివాసము చేసియున్న, దాశరథీ = దశరథుని కుమారుఁడైన శ్రీరామా !

తా. శిరస్సు మణీరాజావంశమున పుట్టి, అందమైన తులసిదండదాల్చి క్షమత్వమాది కల్యాణగుణములచేత నొప్పి, మూఁడు లోకములందును పొగడ్త కెక్కిన పరాక్రమసంపత్తిచే లోభిల్లి కబంధుఁడను రాక్షసుని అడంచి లోకుల పాపములను దొలగించుచు, కరుణాసముద్రుఁడవై భద్రాచలమందు నివాసము చేసియున్న దశరథ కుమారుఁడవైన రామా !

ఉ. రామవిశాలవిక్రమ ప ♦ రాజిత భార్గవరామ, సద్గుణ
స్తోమ, పరాంగనావిముఖ ♦ సువ్రతకామ వినీలనీరద
శ్యామ కకుత్స్థవంశ కల ♦ శాంబుధిసోమ సురారిదోర్బలో
ద్దామ విరామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 2

టీ. రామ = సర్వజనుల రమింపజేయువాఁడా, విశాల = అధికమైన, విక్రమ = పరాక్రమముచేత, పరాజిత = ఓడింపఁబడిన, భార్గవరామ = భృగువంశమునబుట్టిన పరశురాముఁడుగలవాఁడా, సద్గుణస్తోమ— సత్ — గుణ=మంచిగుణములయొక్క స్తోమ=సమూహమైనవాఁడా, పరాంగనా= పర స్త్రీలయందు, విముఖ = పెడమొగము గల, సువ్రత = మంచివ్రతము నందు, కామ = రక్తిగలవాఁడా, వినీల = మిక్కిలి నల్లనయిన, నీరద = మేఘమువలె, శ్యామ=నల్లనయినవాఁడా, కకుత్స్థ = ఇక్ష్వాకువంశ్యులలో నొకఁడైన వానియొక్క, వంశ = వంశమనెడి, కలశ + అంబుధి=పాల సముద్రమునకు, సోమ=చంద్రుఁడైనవాఁడా, సురారి = దేవతలకు శత్రువు లయిన రాక్షసులయొక్క, దోర్బల = బాహుబలముయొక్క, ఉద్దామ = .

అత్యంతమైన, విరాము = ఉడుగుటగలవాఁడా, కరుణాపయోనిధీ=దయా సముద్రుఁడా, భద్రగిరిదాశరథీ = భద్రాచలవాసుఁడవైన రామా!

తా. సౌందర్యాదులచే సర్వజనులను రంజింపఁజేయుచు అధిక పరాక్రమముచే పరశురాముని గెలిచి, పరస్త్రీయందాసక్తి లేనివాఁడవై, నల్లని మబ్బువంటి దేహకాంతితో నొప్పి, కాకుత్స్థవంశమును వర్ధిల్లఁజేసి, రాక్షసులబలము నడంచి దయకలవాఁడవై యొప్పుచున్న భద్రాద్రిరామా!

చ. అగణిత సత్యభాష, శర ♦ ణాగతపోష దయాలసజ్ఝరీ
విగతసమస్తదోష, పృథి ♦ వీసురతోష, త్రిలోకపూత కృ
ద్గగన ధునీమరంద పద ♦ కంజవిశేష మణిప్రభా ధగ
ద్ధగితవిభూష భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 3

టీ. అగణిత=ఎన్నరాని, సత్య = సత్యము, భాష = పలుకువాఁడా లేక (వాక్కులు గలవాఁడా), శరణాగత = శరణుజొచ్చిన వారిని, పోష = పోషించువాఁడా, దయా = దయ యనెడి, లసత్ = ప్రకాశించుచున్న, ఝరీ = ప్రవాహముచేత, విగత = పోయిన, సమస్త = సకలమైన, దోష=(ఆశ్రితులయొక్క) దోషములుగలవాఁడా, పృథివీసుర=బ్రాహ్మణులను, తోష = సంతోషపెట్టువాఁడా, త్రిలోక = మూడులోకములను, పూతకృత్ = పవిత్రముచేయుచున్న, గగన ధుని = ఆకాశనదియైన గంగ యనెడు, మరంద = పూఁదేనెగల, పదకంజవిశేష = చరణపద్మవిశేషము గలవాఁడా, మణి = రత్నములయొక్క, ప్రభా = కాంతులచేత, ధగద్ధగిత = ధగధగమని ప్రకాశింపఁజేయఁబడిన, విభూష = ఆభరణములుగల వాఁడా, కరుణాపయోనిధీ = దయాసముద్రుఁడా, భద్రగిరిదాశరథీ = భద్రాచలవాసుఁడవైన రామా!

తా. సత్యవచనుఁడును, శరణాగతులను బోషించువాఁడును, ఆశ్రితుల దోషములనన్నిటిని యెక్కువ దయచేత బోఁగొట్టువాఁడును, బ్రాహ్మణు

లను సంతోషపెట్టువాఁడును, మూఁడులోకములను పవిత్రముజేయునట్టి గంగానదిచే చరణారవిందములు గలవాఁడును, రత్నములయొక్క కాంతుల చేత ధగధగ మెఱయుచున్న యాభరణములను గలిగినవాఁడును, దయ గలవాఁడును భద్రాచలవాసియునగు శ్రీరామా!

ఉ. రంగదరాతిభంగ, ఖగ • రాజతురంగ, విపత్పరంపరో
త్తుంగ తమఃపతంగ పరి • తోషితరంగ, దయాంతరంగ స
త్సంగ ధరాత్మజాహృదయ • సారసభృంగ, నిశాచరాబ్జమా
తంగ, శుభాంగ, భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 4

టీ. రంగత్ = ప్రకాశించుచున్న, అరాతి = శత్రువులను, భంగ = భంజించినవాఁడా. ఖగరాజ = పక్షిరాజగు గరుత్మంతుఁడే, తురంగ = గుఱ్ఱముగలవాఁడా, విపత్ = ఆపదలయొక్క, పరంపరా = యెడతెగని వరుసయనెడి. ఉత్తుంగ = మిక్కిలియైన, తమః = చీఁకటికి, పతంగ = సూర్యుఁడైనవాఁడా, పరితోషిత = మిక్కిలి సంతోషపెట్టఁబడిన, రంగ = రంగస్వామిగలవాఁడా, దయాంతరంగ = దయగల మనస్సుగల వాఁడా, సత్ + సంగ = సజ్జనులతోడి కూడికగలవాఁడా, ధరాత్మజా = భూదేవికూఁతురైన సీతాదేవియొక్క, హృదయ = మనస్సు అనెడి, సారస = పద్మమునకు, భృంగ = తుమ్మెదయైనవాఁడా, నిశాచర = రాక్షసులనెడి, అబ్జ = తామరలకు, మాతంగ = ఏనుఁగుఅయినవాఁడా, శుభాంగ = మంగళప్రదమైన అవయవములుగలవాఁడా, కరుణాపయోనిధీ, భద్రగిరి దాశరథీ.

తా. శత్రువుల గర్వము నడంచువాఁడును, గరుడవాహనారూఢుఁడును, ఆశ్రితుల యాపదలను పోఁగొట్టువాఁడును, రంగనాథుని సంతోషపెట్టినవాఁడును, దయతోఁగూడిన మనస్సుగలవాఁడును, సత్పురుషులచేత గొలువఁబడినవాఁడును, సీతయొక్క ప్రేమకును, ధ్యానములకును విషయమైనవాఁడును, దయాసముద్రుఁడు నగు భద్రాచలరామా!

ఉ. శ్రీద సనందనాది ముని ♦ సేవితపాద దిగంతకీర్తి సం
పాద సమస్తభూతపరి ♦ పాల వినోద విషాద వల్లికా
చ్ఛేద ధరాధినాథకుల ♦ సింధుసుధామయపాదనృత్త గీ
తాదివినోద భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 5

టీ. శ్రీద = సంపదను ఇచ్చువాఁడా, సనందనాది = సనందనుఁడు మొదలయిన, ముని = ఋషులచేత, సేవిత=కొలువఁబడిన, పాద = చరణములుగలవాఁడా, దిగంత = దిక్కులకొనయందలి, కీర్తి=యశస్సుయొక్క, సంపాద=సంపాదనము గలవాఁడా! సమస్తమైన, భూత = ప్రాణులయొక్క, పరిపాల = రక్షించుటయందు, వినోద = వేడుక కలవాఁడా, విషాద = దుఃఖమనెడి, వల్లికా=తీగను, చ్ఛేద = త్రెంచువాఁడా, ధరాధినాథ = రాజులయొక్క, కుల=వంశమనెడి, సింధు=సముద్రమునకు, సుధామయ = అమృతమయములైన, పాద=కిరణములుగల చంద్రుఁడైనవాఁడా, నృత్త=నాట్యము,గీత=పాట,ఆది=మొదలైన,వినోద=వేడుకలుగలవాఁడా!

తా. ఆశ్రితులకు సంపదల నిచ్చుచు, సనకసనందనాది ఋషులు కొలుచునట్టి పాదములు గలిగి, దిక్కులయందెల్లఁ బ్రసిద్ధిగాంచి, సకల ప్రాణులను లీలమెయినిబ్రోచుచు, దుఃఖములను బోగొట్టుచు, రాజకులము నందుద్భవించుటచే దానికి అభివృద్ధి గలిగించి నృత్తగీతాదులగు వేడుకలం దాసక్తుఁడైన దయాసముద్రుండగు భద్రాచలరామా!

ఉ. ఆర్యుల కెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథభట్టరా
చార్యులకంజలెత్తి కవి ♦ సత్తములన్ వినుతించి కార్యసా
కర్యమెలర్ప నొక్కశత ♦ కంబొనరంగూర్చి రచింతునేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపుమిది ♦ దాశరథీకరుణాపయోనిధీ. 6

టీ. ఆర్యులకున్ ఎల్లన్ = పూజ్యులగు పెద్దలకందఱికిని, వినతాంగుఁడనై = అడఁకువచేత వినమ్రములైన అవయవములు గలవాడనై, మ్రొక్కి,

రఘునాథభట్టాచార్యులకున్ = రఘునాథభట్టరు అనెడి గురువునకు, అంజలొత్తి = చేయిమోడ్చి, కవిసత్తములన్ = కవిశ్రేష్ఠులను, వినుతించి = కొనియాడి, కార్యసౌకర్యము = కార్యము సులభముగా చేయగూడుటను, ఎలర్పన్ = కలుగ, ఒక్క శతకంబు = ఒక శతకమును. ఒనగూర్చి = పొందికజేసి, నేఁడు = నేటిదినము (ఇప్పుడనుట), రచింతున్ = చేసెదను, కరుణాపయోనిధీ = కరుణాసముద్రా, భద్రగిరి దాశరథీ = భద్రాచలవాసియగు శ్రీరామా, ఇది = ఈశతకమును, తాత్పర్యమునన్ = ఆసక్తితోడ; గ్రహింపుము = గైకొనుము.

తా. నేను వినయముతో పెద్దలకందఱికిని మ్రొక్కి, మాగురువులైన రఘునాథ భట్టరువారికి నమస్కరించి, శ్రేష్ఠులను బొగడి, వారియాశీస్సులచే నా కార్యము సుకరము కాఁగా యిపుడు ఒక శతకమును మాత్రమే రచించుచున్నాను. కరుణాసముద్రుఁడవైన భద్రగిరి రామా! నా యీ శతకమును ఆసక్తితోఁ బరిగ్రహింపుము.

చ. మసఁగొని రేఁగుబండ్లకును ♦ మౌక్తికముల్ వెలవోసినట్లు దు
ర్వ్యసనము జెంది కావ్యము దు♦ రాత్ములకిచ్చితి మోసమయ్యె నా
రసనకుఁ బూతవృత్తిసుక ♦ రంబుగఁ జేకుఱునట్లు వాక్సుధా
రసములు చిల్కఁబద్యముఖ ♦ రంగమునందు నటింపవయ్య సం
తసమును జెంది భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 7

టీ. మసగొని = ఆసపడి, రేఁగుబండ్లకును, మౌక్తికముల్ = ముత్తెములను, వెలవోసినట్లు = ఖరీదిచ్చిన, విధమున, దుర్వ్యసనమునన్ = చెడ్డ ఆసక్తిని, చెంది = పొంది, కావ్యము = కావ్యమును, దురాత్ములకున్ = దుష్టులకు, ఇచ్చితిన్ = అంకితముగా యిచ్చితిని, మోసముఅయ్యె = దానిచే మోసపోతిననుట, నారసనకున్ = నానాలుకకు, పూతవృత్తి = పరిశుద్ధమైన వర్తనము, సుకరంబుగన్ = సులువుగా, చేకురునట్లు = కలుగునట్లు,

వాక్సుధారసములు = వాక్కులనెడి యమృతరసములు, చిల్కుచు = ఒలుకు నట్లు, పద్యముఖరంగమునందు = పద్యములు గల నాముఖమనెడి నాట్య రంగమునందు, సంతసమును = సంతోషమును, చెంది, భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ నటింపవయ్యా = నాట్యము సేయుమా.

తా. ముత్యాలు వెలగాపోసి రేగుపండ్లను అపపడినట్లు దుష్టులగు వారికి కావ్యములను జెప్పి పురుషార్థమును చెందక మోసపోతిని, వారిని వర్ణించుటచే నానాలుక మలినమైనది. కావున దానికి సులువుగా పరిశుద్ధి కలుగునట్లు నీకంకితముగా కావ్యము చేయఁగోరెద. అప్పుడు నానాలుక యనెడి రంగమునందు నీవు నిలిచి నటించి అమృతము లొలుకునట్టి పద్యము లను జెప్పునట్లు చేయవలయును.

ఉ. శ్రీరమణీయహార యత ♦ సీకసుమాభశరీర, భక్తమం
దార, వికారదూర, పర ♦ తత్వవిహార, త్రిలోకచేతనో
ద్ధార, దురంతపాతక వి ♦ తాన విదూర, ఖరాదిదైత్య కాం
తారకుఠార, భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 8

టీ. శ్రీ = కాంతిచేత, రమణీయ - మనోజ్ఞమైన, హార=హారము గలవాఁడా, అతసీకుసుమ = అవిసె పువ్వులతో, అభ=సాటియైన, శరీర = దేహము గలవాఁడా; భక్తమందార = భక్తులకు కల్పవృక్షమైనవాఁడా! వికారదూర = వికారములేనివాఁడా, పరతత్త్వవిహార ; పరతత్త్వ = పర మాత్మస్వరూపము యొక్క, విహార= అవతారాదు, విహారములయినవాఁడా, త్రిలోక = మూఁడులోకములందలి, చేతన=జీవులను, ఉద్ధార=ఉద్ధరించు వాఁడా, దురంత = అంతములేని, పాతక = పాపములయొక్క, వితాన= సమూహమునకు, విదూర = మిక్కిలి దూరమైనవాఁడా, ఖరాది = ఖరుఁడు మొదలుగాగల, దైత్య = రాక్షసులనెడి, కాంతార = అడవికి, కుఠార = గొడ్డలియైనవాఁడా, కరుణాపయోనిధీ, భద్రగిరి దాశరథీ.

చ. కనకవిశాలచేల భవ ♦ కానన శాతకుఠారధార స
జ్జనపరిపాల శీల దివి ♦ జస్తుత సద్గుణకాండ కాండ సం
జనిత పరాక్రమక్రమ వి ♦ శారద శారద కందకుందచం
దనఘనసారసారయశ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 10

టీ. కనక = బంగారువన్నెను, విశాల = వెడల్పైనదియును అగు, చేల = వస్త్రములుగలవాఁడా, భవ = పుట్టుకయనెడి, కానన = అడవికి, శాత = వాఁడియైన, కుఠార = గొడ్డలియొక్క, ధార = వాదరవైన వాఁడా, సజ్జన = సత్పురుషులను, పరిపాల = రక్షించుటయు, శీల = స్వభావముగాఁగలవాఁడా, దివిజ = దేవతలచేత, స్తుత = స్తోత్రముచేయఁబడిన, సద్గుణ = మంచిగుణములయొక్క, కాండ = సమూహముగలవాఁడా, కాండసంజనిత = నీటియందు పుట్టిన అగ్నియొక్క, పరాక్రమ = శౌర్యముయొక్క, క్రమ = విధమునందు, విశారద = పండితుఁడవైనవాఁడా, శారద = శరత్కాలసంబంధియైన, కంద = మేఘము, కుంద = మొల్లలు, చందన = చందనము, ఘనసార = పచ్చకర్పూరము, సార = శ్రేష్ఠమైన, యశ = కీర్తిగలవాఁడా.

తా. వెడల్పైన బంగారు వస్త్రమునుగట్టి, పదునైన గొడ్డలిచే అడవిని నఱికినట్లు జన్మపరంపరను నాశనముచేసి, సత్పురుషులను రక్షించుటయే స్వభావముగలిగి దేవతలు పొగడునట్టి సుగుణగణముచే రాణించి, అగ్నివంటి పరాక్రమముతోఁ గూడి శరత్కాలమేఘములు మల్లె, చందనము, పచ్చకప్పురమువలె తెల్లనై మెఱయుచున్న కీర్తిగలిగి, కరుణానిధివయిన భద్రాచలరామా !

ఉ. శ్రీరఘువంశతోయధికి ♦ శీతమయూఖుఁడవైన నీపవి
త్రోరుపదాబ్జముల్ వికసి ♦ తోత్పలచంపకవృత్తమాధురీ
పూరితవాక్ప్రసూనములఁ ♦ బూజలొనర్చెదఁ జిత్తగింపుమీ
తారకనామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 11

టీ. శ్రీ = సంపత్కరమైన, రఘువంశ = రఘురాజవంశమనెడి తోయధికిన్ = సముద్రమునకు, శీతమయూఖుఁడవు=చంద్రుఁడవు, ఐన= అట్టి, నీ = నీయొక్క, పవిత్ర = పావనములును, ఉరు = గొప్పవియు శ్రేష్ఠమైన, పదాబ్జముల్ = తామరలవంటి యడుగులను, వికసిత = ప్రకాశించిన, ఉత్పల=ఉత్పలమాలికలు అనెడి, వృత్త = ఛందోవృత్తములయొక్క, మాధురీ = తీయదనముచేత, పూరిత = నింపబడిన, వాక్ = వాక్కులనెడి, వికసిత = వికసించిన, ఉత్పల = నల్లగలువలయు, చంపక=సంపెంగలయు, వృత్త = వర్తనముగలవియు, మాధురి = చక్కదనముచేత, పూరిత = నిండినవియు. అగు ప్రసూనములన = పువ్వులచేత, పూజలు, ఒనర్చెదను = చేసెదను, తారక=సంసారమును తరింపజేయునట్టి, నామ= దివ్యనామముగలవాఁడా, చిత్తగింపుమీ = అంగీకరింపుమా.

తా. చంద్రుఁడు తాను పుట్టినసముద్రమును వర్ధిల్లఁజేయునట్లు రఘుమహారాజవంశమునంబుట్టి దానిని వృద్ధిజేయువాఁడవైన నీయొక్క పాదారవిందములను ఉత్పలచంపకమాలికావృత్తములందలి వాక్కులనెడి ఉత్పలచంపక పువ్వులచేతఁ బూజించుచున్నాను గైకొనుమా.

చ. గురుతరమైన కావ్యరస ♦ గుంభనకబ్బురమందిముష్కరుల్
సరసులమాడ్కి సంతసిల ♦ జాలుదురోటు శశాంకచంద్రికాం
కురముల కిందుకాంతమణి ♦ కోటిస్రవించినభంగి వింధ్యభూ
ధరమునజారునే శిలలు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 12

టీ. గురుతరము = మిక్కిలిగొప్పది, ఐన, కావ్య = కావ్యమునందలి, రస = శృంగారాది రసములయొక్క, గుంభనకున్ = కూర్పునకు, ముష్కరుల్ = రసజ్ఞతలేని మూఢులు, సరసులమాడ్కి = రసికులవలె, అబ్బురమునందె = ఆశ్చర్యమునుపొంది, సంతసిలన్ = సంతోషించుటకు, చాలుదురోటు = శక్తులగుదురా, శశాంక = (జింకను గురుతుగాగల)

చంద్రునియొక్క, చంద్రిక = వెన్నెలయొక్క, అంకురములన్ = మొలక
లకు, ఇందు కాంతమణి = చంద్ర కాంతములయొక్క, కోటి=సమూహము,
ప్రవించినభంగిన్ = కరిగి పారినరీతిని, వింధ్యభూధరమున=వింధ్యపర్వతము
నందు, శిలలు = రాలు, జాఱునే = కరుగునా.

తా. చంద్రకాంతశిలలు చంద్రుని కిరణములకు కరగునట్లు వింధ్య
పర్వతపుశిలలు కరగి ప్రవింపఁజాలవు అట్లే గొప్ప కావ్యమునందలి రసస్ఫూ
ర్తికి రసికులవలె మూఢులు మెచ్చి సంతోషింపఁజాలరు. కావున నా కావ్య
మును సరసుఁడవైన నీకు అంకితము సేయుచున్నాను.

చ. తరణికులేశ నానుడుల ♦ దప్పులుగల్గిన నీదునామ స
ద్విరచితమైన కావ్యము ప ♦ విత్రముగాదె వియన్నదీజలం
బరుగుచు వంకయైన మలి ♦ నాకృతి పాఱిన దన్మహాత్త్వముం
దరమె గణింప నెవ్వరికి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 13

టీ. తరణికులేశ = సూర్యవంశమునందు జనించిన వారిలో శ్రేష్ఠు
డైనవాఁడా, నానుడులన్ = నామాటలందు, తప్పులు = దోషములు,
కలిగినన్ = కలిగినప్పటికిని, నీదు=నీయొక్క, నామ=పేరుతోడ. సత్=
శ్రేష్ఠమయినదియు. విరచిత = రచింపఁబడినదియు, ఐన కావ్యమునన్=అయి
నట్టి కావ్యము, పవిత్రము కాదె = పావనమే యగును కాదా, వియన్నదీ
జలంబు = ఆకాశగంగయొక్క నీరు, అరుగుచున్=ప్రవహించుచు, వంక
యైన = వంకరగానయినను, మలిన+ఆకృతిన్ = మురికిగల ఆకారముతో
పాఱినన్ = ప్రవహించినను, తన్మహాత్త్వమున్ = దాని మహత్త్వమును,
గణింపన్ = ఎన్నుటకు, తరమె = శక్యమా (శక్యము కాదనుట.)

తా. సూర్యవంశమున జనించినవారిలో శ్రేష్ఠుడయినవాఁడా! నా
మాటలయందు దోషము లెన్నియున్నను, నీయొక్క నామముతోడ శ్రేష్ఠ
మయినదియు, రచింపఁబడినదియు కావ్యము పవిత్రమైనది కాదా! (అగు

ననుట) అనగా ఆకాశగంగయొక్క నీరు ప్రవహించుచు వంకరగా పాతి వను మతికగల ఆకారముతో ప్రవహించినను దాని మహాత్మ్యము ఎన్ను టకు శక్యమా! (కాదనుట)

ఉ. దారుణపాతకాబ్ధికి స ♦ దాబడబాగ్ని భవాకులార్తి వి
స్తారదవానలార్చికి సు ♦ ధారసవృష్టి దురంత దుర్మతా
చార భయంకరాటవికిఁ ♦ జండకఠోర కుఠారధార నీ
తారకనామ మెన్నఁగను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 14

టీ. నీ తారక నామము = సంసారమును తరింపజేయునట్టి నీయొక్క రామనామము, ఎన్నఁగన్ = తలఁపగా, దారుణ = భయంకరమయిన, పాతక = పాపములనెడి, అబ్ధికిన్ = సముద్రమునకు, సదా = ఎల్లప్పుడు బడబాగ్ని = బడబాగ్నియగును, భవ = సంసారముయొక్క, ఆకుల = వ్యాప్తమైనట్టి, ఆర్తి = పీడయొక్క, విస్తార = బాహుళ్యమనెడి, దవానల = కారుచిచ్చుయొక్క, అర్చికిన్ = సెగకు, సుధారసవృష్టి = అమృతద్రవ వర్షము, దురంత=మితిమీఱిన, దుర్మత=దుష్టమతములయొక్క, ఆచార = ఆచారములనెడి, భయంకర = భయంకరమును కలిగించునట్టి అడవికిన్ = అడవికి, చండ = తీక్ష్ణమును, కఠోర = కటుకయినదియును అగు, కుఠార = గొడ్డలియొక్క; ధార= మొన (వ టిది.)

తా. సంసారతారకమయిన నీరామనామము బడబాగ్ని సముద్రమును పీల్చునట్లు భయంకరములైన పాతకములను పోగొట్టును. అమృత ద్రవవర్షము కాలుచున్న చిచ్చును చల్లార్చుచున్నట్లు సంసారబాధలను ఉపశమింపఁ జేయును. పదునైన గొడ్డలిచే భయంకరమయిన అడవిని నఱుకునట్లు మితి మీఱిన దుర్మతాచారములను నిర్మూలము చేయును.

చ. హరునకు నవ్విభీషణున ♦ కద్రిజకుం దిరుమంత్రరాజమై
కరికి నహల్యకున్ ద్రుపద ♦ కన్యకు నార్తిహరించు చుట్టమై.

వరగినయట్టి నీపవిత్ర ♦ పావననామము ♦ జిహ్వపై నిరం
తరము నటింపఁజేయుమిఁక ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 15

టీ. హరున కుఁ = శివునకును, అవ్విభీషణు కున్ = విభీషణునికిని, అద్రిజకున్ = పార్వతికి, తిరుమంత్రరాజము - తిరు శ్రీకరమైన, మంత్రరాజము = శ్రేష్ఠమయిన మంత్రము. ఐ - అయి, కరికిన్ = ఏనుఁగు కును, అహల్యకున్ = హల్యకును, ద్రుపదకన్యకుఁ = ద్రౌపదికిని, ఆర్తిఁ = మనోవ్యధను, హరించుచుట్టము = పోఁగొట్టునట్టి బాంధువు అయి, వరగినయట్టి = ప్రసిద్ధిఁ గాంచినట్టి, నీ = నీయొక్క, పతిత = పతితులయినవారిని, పావన = పరిశుద్ధులను జేయునట్టి, నామము = పేరు, ఇఁకన్, జిహ్వపైన్ = నాలుక మీఁద, నిరంతరము = ఎడతెగక, నటింపఁజేయుము = నృత్యము చేయునట్లు చేయుమా.

తా. దశరథరామా! శివునికి, విభీషణునికి, పార్వతికిని శ్రేష్ఠమయిన మంత్రమై, గజేంద్రునికిని, అహల్యకును, ద్రౌపదికిని చుట్టమువలె చిక్కులను దొలగించినదై పాపులను పవిత్రులను జేయునట్టి నీనామమును నా నాలుకయందు నటించునట్లు చేయుమా.

ఉ. ముప్పునఁ గాలకింకరులు ♦ ముంగిటవచ్చిన వేళ రోగముల్
గొప్పరమైనచోఁ గఫము ♦ కుత్తుకనిండిన వేళ బాంధవుల్
గప్పినవేళ మీస్మరణ ♦ గల్గునొ గల్గదొ నాఁటికిప్పుడే •
తప్పక చేతు మీభజన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 16

టీ. ముప్పునఁ = ముసలితనమందు, కాలకింకరులు = యమదూతలు, ముంగిటన్ = ఇంటిముంగిటికి, వచ్చినవేళన్ = వచ్చినట్టి సమయమునను, రోగముల్ = తెవుళ్ళు, గొప్పరము = అతిశయించినవి, అయినచోన్ = అయినప్పుడును, కఫము, కుత్తుకన్ = కంఠమునందు, నిండినవేళన్ = పూర్ణమయిన సమయమునందును, బాంధవుల్ = చుట్టములు, కప్పినవేళన్ =

క్రమ్మఁగొన్నప్పుడును, మీస్మరణ = మిమ్ములను స్మరించుట, నాటికిన్ = అప్పటికి, కల్గునో కల్గదో యేమొ, ఇప్పుడే తప్పక = విడువక, మీభజన = మిమ్ము భజించుట, చేతున్ = చేయుదును.

తా. శ్రీరామా! ముసలితనముకచ్చి సేనున్నపోటికి యమదూతలు వచ్చినపుడును, రోగములు మిక్కిలి ముమ్మరమైనపుడును, మరణము సమీపింపఁగా కఫము గొంతుకయందు నిండియున్నపుడును, అప్పుడు చుట్టములు చుట్టును క్రమ్ముకొని యుండఁగాను మిమ్ము స్మరించుట నాకు కలుగునో కలుగదో చెప్పఁజాలను. కనుక ఇప్పుడే తప్పక నిన్ను భజనచేసెదను.

చ. పరమదయానిధే పతిత ♦ పావననామ హరే యటంచు సు
స్థిరమతులై సదా భజన ♦ సేయు మహాత్ముల పాదధూళినా
శిరమునఁ దాల్తుమీరటకుఁ ♦ జేరకుఁడంచు యముండుకింకరో
త్కరములఁ గానఁబెట్టునట ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 17

టీ. పరమ = మిక్కిలియైన, దయా = కృపకు, నిధే = నిదానమైన వాఁడా, పతిత = పాపాత్ములను, పావన = పవిత్రులనుగా చేయునట్టి, నామ = పేరుగలవాఁడా, హరే = శ్రీహరీ, అటంచున్ = అని, సదా = ఎప్పుడును, సుస్థిర = మిక్కిలి నిలుకడగల, మతులు = మనసుగలవారు, ఐ = అయి, భజన = భజించుట, చేయుమహాత్ముల = చేయునట్టి మహానీయులయొక్క, పాదధూళి = అడుగులదుమ్ము, నాశిరమునన్ = నాతల యందు, తాల్తున్ = ధరింతును, మీరు, అటకున్ = వారికడకు, జేర కుఁడు = పోవకుఁడు, అంచున్ = అనుచు, యముండు = యముడు, కింకరోత్కరములకున్ = తన సేవకుల సమూహములకు, ఆనబెట్టునట = ఒట్టుపెట్టునని చెప్పుదురు.

తా. పాపాత్ములను పవిత్రులనుగఁ జేయునట్టి పేరు గలవాఁడా! హరీ అని ఎప్పుడును మిక్కిలి నిలకడగల మనస్సుగలవారలు భజించునట్టి మహానీయులయొక్క పాదధూళి నా తలయందు ధరింతును. మీరు వారి

కడకు పోతకుఁడనుచు యముఁడు తమ సేవకు సముదాయములకు ఒట్టుబెట్టు నని చెప్పుదురు.

చ. అజనకుఁ దండ్రివయ్యు సన ♦ కాదులకుంబరతత్త్వమయ్యును
ద్విజమునికోటికెల్ల, బర ♦ దేవతవయ్యుఁ దినేశవంశ భూ
భుజులకు మేటివయ్యుఁ ♦ బరిపూర్ణుఁడవై వెలుగొందుపక్షిరా
డ్ధ్వజ మిముఁబ్రస్తుతించెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 18

టీ. అజనకున్ = బ్రహ్మకు, తండ్రివయ్యున్ = తండ్రివయి, సన కాదులకున్ = పరతత్వవేత్తలైన సనకుఁడు సనందనుఁడు మొదలయినవారికి, పరతత్వముఅయ్యున్ = తత్వ్రష్టవస్తువై, పర్ =శ్రేష్ఠులయిన, ద్విజ = బ్రాహ్మణులయొక్క, ముని = ఋషులయొక్క, కోటికిన్ ఎల్లన్ = సమూహమున కంతకు, పర దేవతవు అయ్యున్ = శ్రేష్ఠమైన దైవమవై, దినేశ = సూర్యుని యొక్క, వంశ = కులమందలి, భూభుజులకున్ = రాజులకు, మేటివయ్యున్ = శ్రేష్ఠుఁడవై, పరిపూర్ణుండవు = నిండినవాఁడవు, ఐ = అయి, వెలుగొందు = ప్రకాశించుచున్న, పక్షిరాడ్ధ్వజ = పక్షులకెల్ల రాజైన గరుత్మంతుఁడు వాహనము గాఁగలవాఁడా, మిమ్మున్ = మిమ్ము, ప్రస్తుతించెదను = మిక్కిలి స్తోత్రము చేసెదను.

తా. బ్రహ్మకు తండ్రిగాను, సనకసనందనాది మహర్షులు ధ్యానము సేయు పరతత్వముగాను, విప్రమునిసమూహములు కొలుచునట్టి పరదైవము గాను, ఇట్లు అన్నిలక్షణములను పరిపూర్తిఁ బొందిన వాఁడవై గరుడుఁడు ధ్వజము గాఁగలిగి ప్రకాశించు దయానిధీ! నిన్ను మిక్కిలి ప్రస్తుతించెదను.

ఉ. "పండిత రక్షకుండఖిల ♦ పాపవిమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు దశ ♦ కంఠవిలుంఠన చండకాండ కో
దండ కళా ప్రవీణుఁడను ♦ తావకకీర్తి వధూటికిత్తుఁ బూ
ద్దండలుగాఁగ నాకవిత ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 19

టీ. పండితరక్షకుండు=పండితులను రక్షించువాఁడు, అఖిలపాప=సమస్త పాపములనుండి, విమోచనుండు=విడిచిపుచ్చువాఁడు, అబ్జసంభవ=బ్రహ్మచేతను, అఖండల=ఇంద్రునిచేతను, పూజితుండు=పూజింపఁబడువాఁడు, దశకంఠ=రావణాసురుని పదితలలను, విలుంఠన=కొల్లగొనుట చేత, చండ=తీక్ష్ణమయిన, కాండ=బాణములుగల, కోదండకళా=విలువిద్యయందు, ప్రవీణుఁడు=నేర్పరియైనవాఁడు, అను=అనెడి, తావక=నీయొక్క, కీర్తి=యశస్సుఅనెడి, వధూటికిన్=స్త్రీకి, నాకవిత=నా కవిత్వమును, పూదండలుగాఁగ=పూలసరములు అగునట్లుగా, ఇత్తున్=ఇత్తును.

తా. కరుణాసముద్రుఁడవయిన రామా! పండితులను రక్షించువాఁడు సమస్తపాపములను దొలఁగించువాఁడు బ్రహ్మేంద్రాదులచే పూజింపబడువాఁడు, రావణాసురుని తలలు దునుమనట్టి వాడిబాణములను వేయనేర్చిన విలువిద్యయందు నేర్పరియైనవాఁడు అనెడి నీకీర్తికి నాకవిత్వమును ఇచ్చి ఒక పడఁతికి పూదండలిచ్చి యలంకరింపఁ జేసినట్లు ఆకీర్తిని శోభిల్ల జేయుదును.

ఉ. శ్రీరమ సీతగాఁగ నిజ ♦ సేవకబృందము వీరవైష్ణవా
చారజనంబుగాఁగ విర ♦ జానది గౌతమిగా వికుంఠము
న్నారయ భద్రశైల శిఖ ♦ రాగ్రముగాఁగ వసించుచేతనో
ద్ధారకుఁడైన విష్ణుఁడవు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 20

టీ. శ్రీరమ=లక్ష్మీదేవి, సీతగాఁగన్=సీతాదేవిగాఁగ, నిజ=తనదైన సేవకబృందము=పరిజనులసమూహము, వీరవైష్ణవ ఆచార=ఆచారములుగల, జనంబుగాఁగన్=జనులుగాఁగా, విరజానది, గౌతమిగాన్=గోదావరిగాఁగా, వికుంఠమున్=వైకుంఠమును, అరయన్=విచారింపఁగా, భద్రశైల=భద్రాచలముయొక్క, శిఖర=శిఖరముయొక్క, అగ్రముగాఁగన్=కొనగాఁగా, వసించి=నెలకొని, చేతనోద్ధారకుఁడు=చేతనుల నుద్ధరించువాఁడు, ఐనవిష్ణుఁడవు=అయినట్టి సాక్షాద్విష్ణుదేవుఁడవు.

టీ దశరథరామా! నీవు పరమపదమందున్న లక్ష్మీదేవిని ఇచట సీతగాఁ జేసికొని, అందలి పరివారము ఇచ్చట పీరవైష్ణవజనులుగా వచ్చి కొలుచుచుండగా, అచట విరజానది ఇచట గోదావరిగా ప్రవహింపగా, అక్షరుకరము యిచట భద్రగిరి కొమ్మకోనయై రాణింపఁగా నేంచేసిన చేతను లను ఉద్ధరించుచున్న శ్రీ విష్ణుదేవుండవే కాని వేఱుకావు.

ఉ. కంటిఁ దీతటంబుఁ బొడ ♦ గంటిని భద్రనగాధి వాసముం
గంటి నిలాతనూజ నురు ♦ కార్ముకమార్గణశంఖచక్రముల్
గంటినిమిమ్ము లక్ష్మణునిఁ ♦ గంటిఁగృతార్థుఁడనైతి నోజగ
త్కంటక దైత్యనిర్దళన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 21

టీ. జగత్ = లోకములకు, కంటక = హింసించువారైన, దైత్య = రాక్షసులను, నిర్దళన = సంహరించువాఁడా, కరుణాపయోనిధీ, దాశరథీ నదీతటంబు=నదియొక్క తీరమును, కంటిన్ = చూచితిని, భద్రనగాధివాసమున్ = భద్రాచలమనఁబడెడి నివాసస్థానమును కంటిన్ = చూచితిని, ఇలతనూజన్ = భూదేవికూతురైన సీతాదేవిని, కంటిన్ = చూచితిని, ఉరు=గొప్పదైన, కార్ముక విల్లు, మార్గణ = బాణములు, శంఖచక్రముల్=శంఖమును చక్రమును, కంటిని = చూచితిని, కృతార్థుఁడను=ధన్యుఁడను, ఐతిన్=ఐతిని.

తా. లోకహింసకులైన రాక్షసులనణఁచువాఁడవు, దయాసముద్రుడవై యొప్పు శ్రీరామా! నీవు నే చేసికొనుచున్న భద్రగిరియొద్దనున్న గోదావరి గట్టును; నీవు నేఁచేసియున్న భద్రాచలవాసమును; సీతాదేవిని, నీవిల్లును బాణములను, శంఖచక్రములను, నిన్నును, లక్ష్మణుని సేవించి కృతార్థుఁడనైతి.

చ. హాలికునకుఁ హలాగ్రమున ♦ నర్థము సేకురుభంగి దప్పిచే
నలమటఁ జెందువానికి సు ♦ రాపగలో జలమబ్బినట్లు దు

ర్మలినమనోవికారినగు ♦ మర్త్యునినన్నొడఁగూర్చినీపయిం
దలఁపు ఘటింపఁజేసితివి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 22

టీ. దాశరథీ, హాలికునకున్ = మడఁక దున్నువానికి, హలాగ్రమునన్ = నాఁగలి మొనయందు, అర్థము = ధనము, సేకుఱుభంగిన్ = లభించిన విధమున, దప్పిచేన్ = దాహముచేత, అలమటన్ = బడలికను, చెందువానికి = పొందువానికి, సురాపగలోన్ = గంగలో, జలము = నీరు, అబ్బినట్లు = దొరికిన విధమున, దుర్మలిన = మిక్కిలి దోషయుక్తమైన, మనః = మనస్సుయొక్క; వికారిని = వికారము గలవాఁడను, అగు మర్త్యునిన్ = అయిన మనుష్యుని, నన్నున్, ఒడఁగూర్చి = సవరించి, నీపయిన్ = నీమీఁద, తలఁపు = చింతనము, ఘటింపఁజేసితివి = కలుగఁజేసితివి.

తా. మడఁకదున్నుకొను బీదకు మడఁకమొనగల భూమిలో ధనము దొరికినట్లును, దప్పిగొని బడలినవానికి గంగానదిలోని నీరులభించినట్లును, దుష్టమనస్సుగల మనుష్యుఁడనైన నన్ను చక్కఁజేసి నీపయి తలఁపుగలిగించి ధన్యుని చేసితివి.

ఉ. కొంజక తర్కవాదమను ♦ గుద్దలిచేఁ బరతత్త్వభూస్థలిన్
రంజిలఁద్రవ్వి కన్గొనని ♦ రామనిధానము నేఁడు భక్తిసి
ద్ధాంజనమందుహస్తగత ♦ మయ్యెఁబళీయనఁగా మదీయహృ
త్కంజమునన్ వసింపుమిఁక ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 23

టీ. కొంజకన్ = సంకోచింపక, తర్కవాదము = తర్కము చేయువివాదము, అనుగుద్దలిచేత, పరతత్త్వభూస్థలిన్ = పరతత్త్వము అనెడి భూప్రదేశమును రంజిలన్ = ఒప్పుగా, త్రవ్వి, కన్గొనని రామనిధానము = చూడలేనిరాముఁడు అనెడినిధి, నేఁడు = ఇపుడు, భక్తిసిద్ధాంజనమున్దు = భక్తియనెడి సిద్ధకృతమైన కాటుకయందు, హస్తగతము = చేతికిదొరికినది, అయ్యెన్ = ఆయెను, అనఁగాన్ = అనునట్లు, ఇకన్ = ఇకమీఁద, భక్తిచేత, మదీయ హృత్కంజమునన్ = నాహృదయకమలమునందు, వసింపుము = నెలకొనుము.

తా. భూమిని గుద్దలిచే త్రవ్వినను కనబడని నిధి అంజనముచే లభించునట్లు, పరతత్వ తర్కవాదములచే ఎంత పరిశీలించినను అంతు తెలియరాని రాముఁడవగు నీవు భక్తిచే సులభముగా నాకు వశమైతివి. ఇఁక నా హృదయమునందు వసింపుమా.

ఉ. రాముఁడు ఘోరపాతక వి ♦ రాముఁడు సద్గుణకల్పవల్లికా
రాముఁడు షడ్వికారజయ ♦ రాముఁడు సాధుజనావనవ్రతో
ద్దాముఁడు రాముఁడే పరమ♦ దైవము మాకని మీయడుంగు గెం
దామరలే భజించెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 24

టీ. రాముఁడు-రమింపజేయువాఁడు, ఘోర = భయంకరములైన, పాతక=పాతకములను, విరాముఁడు=తొలఁగించువాఁడు, సద్గుణ=మంచిగుణములు అనెడి కల్పవల్లికా=కల్పవృక్షపు తీఁగలకు, ఆరాముఁడు=తోఁటయైనవాఁడు, (సజ్జనకల్పవల్లికా రాముఁడు) షడ్వికార=పుట్టుట, పెరుగుట మొదలయిన ఆరువికారములయొక్క, జయ = గెలుపుచేత, రాముడు=మనోజ్ఞుఁడయినవాఁడు, సాధుజన=సజ్జనులను, అవన=రక్షించుట అనెడి, వ్రత=నియమముచేత, ఉద్దాముండు=అధికుఁడయినవాడు, శ్రీరాముఁడే = శ్రీరాముఁడే మాకు పరమదైవము అని, మీ అడుంగు కెందామరలను = మీపాదములనెడి ఎఱ్ఱతామరలను, నేను, భజించెదను-కొలిచెదను.

తా. సకలజనులను రమింపఁజేయువాఁడును, ఘోరములైన పాపములను తొలగించువాఁడును సద్గుణములను అవ్వారిగ [illegible] లవాడును, వికారరహితుఁడై ప్రకాశించువాఁడును, సాధుజనులను రక్షించునట్టివాఁడును, రాముఁడే మాకు పరమదైవమని మీపాదారవిందములను కొలిచెదను.

ఉ. చక్కెరమాని వేముదినఁ ♦ జాలినకైవడి మానవాధముల్
పెక్కురుబక్కదైవముల ♦ వేమఱు గొల్చెద రట్లకాదయా
మ్రొక్కిననీక మ్రొక్కవలె ♦ మోక్షమొసంగిననీవయీవలెం
దక్కినమాటలేమిటికి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 52

టీ. చక్కెరన్ = పంచదారను, మాని = విడిచి, వేమున్ = వేప చెట్టును, చేదును, తినన్ = తినుటకును, చాలినకైవడిన్ = తలచినవిధమున, మానవాధముల్ = హీనులు, పెక్కుర్ = అనేకులు, ఒక్కదైవములన్ = అల్పదేవతలను, వేమరున్ = పలుమారులు, కొల్చెదరు = సేవించెదరు, అట్లు = అవిధమే, కాదయా = కాదు, మ్రొక్కినన్ = మ్రొక్కినయెడల, నీవు = నీకే, మ్రొక్కవలె = నమస్కరింపవలెను, మోక్షము = ముక్తిని, ఒసంగినన్ = ఇచ్చినను, నీవే, ఈయవలెన్ = ఇయ్యవలెను. తక్కిన మాటలు = ఇతరవిషయములు, ఏమిటికిన్ = ఎందుకు ?

తా. హీనులైనవారు అనేకులు నిన్ను వదలి ఇతర అనేకములను కొలిచెదరు. అనగా తియ్యని చక్కెరను విడిచి చేదైన వేమును తినుటకు తలచినట్లున్నది. ఇది సరి కాదు. మ్రొక్కదగినవాఁడవు నీవే. మోక్షమిచ్చు వాఁడవును నీవే.

ఉ. 'రా' కలుషంబులెల్ల బయలం ♦ బడద్రోచిన 'మా' కవాటమై
డీకొని ప్రోచునిక్కమని ♦ ధీయుతులెన్నఁ దదీయవర్ణముల్
గైకొని భక్తిచేనుడువఁ ♦ గానరుగాక విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 26

టీ. 'రా' = రామ అనెడి పేరునందలి రేఫము. కలుషంబులెల్లన్ = దోషములన్నిటిని, బయలన్ = వెలుపల, పడన్ దోయగాన్ = పడునట్లు త్రోసివుచ్చఁగా. 'మా' = 'మ' అను అక్షరము. కవాటమై = తలుపై, డీకొని = తాఁకి, ప్రోచున్ = కాపాడును, నిక్కము = ఇదినిజము. అని, ధీ = బుద్ధితోడ, యుతులు = కూడినవారు, జ్ఞానులు, ఎన్నన్ = తలఁపఁగా, తదీయవర్ణముల్ = ఆయక్షరములను, కైకొని = చేకొని, గ్రహించి, భక్తిచేన్ = భక్తిపూర్వకముగా, నుడువన్ = చెప్పుటకు, కానరు = తెలియరు, కాక = కానిచో, విపత్ = ఆపదలయొక్క, పరంపరల్ = ఎడతెగని

తరుణులు, జగత్ + జనులన్ = జగమునందలి వారిని (లోకులనగుట)
పైకొనునె = ఆక్రమించునా.

తా. "రామ" అను దివ్యనామమందలి రేఫము పాపములన్నిటిని బయటికి తరుముగా "మ" అనెడి అక్షరము తలుపువలె అడ్డపడి వానిని ఎదిరించి లోపలికి రాకుండునట్లు చేసి ఆశ్రితులను కాపాడును. ఇది నిజమని జ్ఞానవంతులు చెప్పగా మూఢులా యక్షరములను గ్రహించి జపించకున్నారు. ఇట్లుగాక లోకులు వానిని జపించిరేని యెడతెగక వచ్చు ఆపదలు వారికి గలుగవు.

ఉ. రామహరే కకుత్స్థకుల ♦ రామహరే రఘురామరామ శ్రీ
రామహరే యటంచు మది ♦ రంజిల కేకగళంబులీల నీ
నామము సంస్మరించిన జ ♦ నంబు భవంబెడబాసితత్పరం
ధాము వాసులౌదురట ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 27

టీ. రామా=రామా, హరే=హరీ, కకుత్స్థకులరామా=కాకుత్స్థవంశమున పుట్టినరామా, హరే=హరీ, రఘురామా=రఘురాజసంతతివాడైనరామా! రామా=రామా, శ్రీరామ=శ్రీరామా, హరే=హరీ, అటంచున్=అని, మది=మనస్సు, రంజిలన్=రంజిల్లునట్లు, కేక=కప్పయొక్క, గళంబులీలన్=గొంతు విధమున, స్మరించిన జనంబు=మనస్సులో తలంచిన జనులు, భవంబు=జన్మములు, ఎడబాసి=విడిచి, తత్=ప్రసిద్ధమైన, పరంధామ=శ్రేష్ఠమైన అపరమపదమునందు, వాసులు=నివసించువారు! ఔదురు అట=అగుదురు.

తా. రామా! హరే! కాకుత్స్థరఘురామా! శ్రీరామా! హరే! అని నీనామమును కప్పగొంతువలె మనస్సున మాటిమాటికిఁ దలంచుజనులు ఇఁక జన్మమెత్తుటను విడిచి పరమపదమందు వసింతురుగదా!

ఉ. చక్కెరలప్పరున్ మిగుల ♦ జవ్వని కెంజిగురాకుమోవికిం
జొక్కపుజుంటితేనియకుఁ ♦ జొక్కలుచుం గనలేరుగాక నే

డక్కటరామనామమధు♦రామృతమానుటకంటె సౌఖ్యమా
తక్కినమాధురీ మహిమ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 28

టీ. చక్కెరలప్పుకున్ = కంచదారలయొక్క రాశిని, జవ్వని = యౌవనము గల స్త్రీయొక్క, కెంపు + చిగురాకుమోవికిన్ = ఎఱ్ఱని చిగురు వంటి అధరమునకును, చోఁకు జుంటితేనియకున్ = అచ్చమైన జుంటీగలు గూర్చిన తేనెకును, మిగులన్ = మిక్కిలి. చొక్కులుచున్ = చొక్కుచు, కనలేరు గాక = (రామనామముయొక్క మాధుర్యమును) తెలిసికొనలేరు గాని, అక్కటా! రామనామ = రామ అనెడి నామముయొక్క, మధుర = తియ్యనైనఁ అమృతము, ఆనుటకంటెన్ = ఆస్వాదించుట కంటెను, తక్కిన = ఇతరమైన, మాధురీ = తీపియొక్క, మహిమ = పేరిమి సౌఖ్యమా = సుఖమైనదా!

తా. రామ! చక్కెర రాశిని, ఎలప్రాయము గల స్త్రీల చిగురాకు వంటి ఎఱ్ఱని పెదవికిని, తేనెటీగలు గూర్చిన అచ్చతేనెకును చొక్కి రామ నామముయొక్క మాధుర్యమును తెలిసికొనక జనులున్నారు గాని, అమృతము వలె అతిభోగ్యమైన రామనామము ఆస్వాదించుటకంటెను తక్కినవాని మాధుర్యాతిశయము సుఖప్రదము కానేరదు. రామనామమే అన్నిటికంటెను మధురముయినది.

ఉ. అండజవాహ నిన్ను హృద ♦ యంబుననమ్మినవారిపాపముల్
కొండలవంటివైన వెసఁ ♦ గూలి నశింపకయున్నె సంతతా
ఖండలవైభవోన్నతులు ♦ గల్గకమానునె మోక్షలక్ష్మికై
దండయొసంగకున్నె తుద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 29

టీ. అండజవాహ = పక్షివాహనా, నిన్నున్, హృదయంబున = మనస్సునందు, నమ్మినవారి పాపముల్ = నమ్మినట్టి వారలయొక్క పాపములు, కొండలవంటివి = కొండలవలె మిక్కిలి గొప్పవానులైనవి, వెసన్

అయినను, వెసన్ = త్వరితముగా, కూలి = క్రిందపడి, నశింపకయున్నె = చెడిపోక యుండునా, సంతత=ఎడతెగనట్టి, ఆఖండల=ఇంద్రునియొక్క, వైభవ = విభవముయొక్క, ఉన్నతులు = అతిశయములు, కల్గకమానునె= లభింపకపోవునా, తుదన్ = కడపట, మోక్షలక్ష్మి = ముక్తిరూపమైన లక్ష్మి, కైదండ=సాహాయ్యము, ఒసంగకయున్నె=ఇయ్యకుండునా!

తా. పక్షివాహనా! మనస్సునందు నిన్ను నమ్మినవారికి మొదట కొండలవలె పెద్దకుప్పలుగాయున్న వారిపాపములు నశించిపోవకమానవు. ఇంద్రుని యైశ్వర్యమువంటి మహదైశ్వర్యము కలుగక పోదు. పిమ్మట మోక్షము లభింపక పోదు.

ఉ. చిక్కనిపాలపై మిసిమి ♦ జెందిన మీఁగడపంచదారతో
మెక్కినభంగి మీవిమల ♦ మేచకరూప సుధారసంబు నా
మక్కువపళ్లెరంబున స ♦ మాహిత దాస్యము నేటిదోయిటన్
దక్కెనటంచు జుఱ్ఱెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 30

టీ. చిక్కనిపాలపై=చిక్కనగు పాలమీఁద, మిసిమిజెందిన మీఁగడన్, మిసిమిన్=కాంతిని, జెందిన=పొందిన, మిసమిసలాడునట్టిదియనుట, మీఁగడన్=మీఁగడను, పంచదారతోన్ = చక్కెరతోడఁగూర్చి, మెక్కిన భంగిన్=తిన్నవిధమున, మీ=మీయొక్క, విమల=అచ్ఛమయిన, మేచక = నల్లని, రూప = ఆకారము అనెడి, సుధారసంబు=అమృతరసమును, నా=నాయొక్క, మక్కువ=ప్రేమయనెడి, పళ్ళెరంబునన్ = భోజన పాత్రమున, సమాహిత=హెచ్చరికగల, దాస్యము=కొలువు, అనేటి=అనునట్టి, దోయిటన్=దోసిలియందు, దక్కెను = లభించెను, అటంచున్ = అనుచు, జుఱ్ఱెదను=జుఱ్ఱుచున్నాను.

తా. చిక్కనిపాలమీద మిసమిసలాడు మీఁగడను చక్కెరతోఁ గలిపి తినునట్లు మిక్కిలి అమృతరసమువలె నుండు నీ నల్లని రూపమును

మేటి = దిట్టయగు, అయిన, రామ=రామచంద్రా! నాతలపునన్=నాచింతన యందు, నాటి = నెలకొని, రాఁగదవె = రమ్ము.

తా. శ్రీరామా! మత్స్యము వైసోము కాసురుని కొఱకు సముద్రము జొచ్చి, కూర్మమువయి మందరపర్వతము పాలసముద్రములో మునిఁగిన దానిని ఎత్తినిలిపి, వరాహమవై ప్రళయజలములో రసాతలమునంటిన భూమిని కోరకొమ్మున నెత్తికొనివచ్చి, నరసింహుఁడవై హిరణ్యకశిపుని దేహము చీల్చి, వామనుఁడవై బలిచక్రవర్తిని రసాతలమునకు అణఁగఁద్రొక్కి, పరశురాముఁడవై రాజసమూహమును సంహరించినట్టి నీవు నామనస్సునందు దృఢముగా నిల్చియుండుమా.

ఉ. ఖండనభీముఁడార్తజన ♦ బాంధవుఁడుజ్జ్వల బాణతూణ కో
దండకళాప్రచండ భుజ ♦ తాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటి దైవమిఁక ♦ లేఁడనుచున్ గడగట్టి భేరికా
దాండదదాండదాండ నిన ♦ దంబు లజాండమునిండ, మత్తవే
దండమునెక్కి చాటెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 34

టీ. ఖండన = యుద్ధమందు, భీముఁడు = భయంకరుఁడు, ఆర్తజన= సంకటము నొందినవారి సమూహమునకు, బాంధవుఁడు=చుట్టము, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, బాణ = బాణములు, తూణ = పొదులును గల కోదండకళా=విలువిద్యయందు ప్రచండ=తీవ్రమయిన, భుజ=బాహువుల యొక్క, తాండవ = నటనముచేతఁ గలిగిన, కీర్తికిన్ = యశస్సుగల వాఁడగు, రామమూర్తికిన్ = రామచంద్రునికి, రెండవసాటి దైవము = సమానమైన మఱియొక దైవము, ఇకన్ = ఇంకను, లేఁడు అనుచున్, గడ గట్టి = స్తంభమునాటి, భేరికా = భేరియొక్క, దాండదదాండదాండ (అనెడి) నినదంబులు=శబ్దములు, అజాండము = బ్రహ్మాండము, నిండన్ = నిండునట్లు, మత్తవేదండము = మదించిన యేనుగును, ఎక్కి, చాటెదను = ప్రకటించెదను.

తా. రాముఁడు శత్రువులకు యుద్ధమందు భయంకరుఁడు, భక్తులకు చుట్టమువంటివాడు. కావున బాణములను అస్త్రములపొదులును, ప్రకాశించు చున్న విలువిద్యానేర్పు తీవ్రమైన భుజముల లాఘవముచే పొగడ్తకెక్కిన శ్రీరామమూర్తికి సాటియైనది మఱియొకటి లేదనుచు బ్రహ్మాండ మదురునట్లు డాం ఢాం అని భేరికొట్టుచు మదఘనేనుఁగు నెక్కి చాటెదను.

ఉ. అవనిజ కన్నుదోయి తొగ ♦ లందు వెలింగెడు సోమ జానకీ
కువలయనేత్రి గబ్బిచను ♦ గొండలనుండు ఘనంబు మైథిలీ
నవ నవ యౌవనంబను వ ♦ నంబునకున్ మదదంతివీవె కా
దవిలి భజింతునెల్లప్పుడు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 35

టీ. అవనిజ=సీతయొక్క, కన్నుదోయి=రెండుకన్నులనెడు, తొగలందు = కలువపూవులయందు, వెలిగెడు సోమ = ప్రకాశించుచున్న చంద్రుడైనవాఁడా, జానకీ = జనకునికూతురైన సీత అనెడి, కువలయనేత్రి=కలువపూవులవంటి కన్నులుగల,గబ్బి=ఉబ్బులయిన, చనుకొండలన్= ఉండు ఘనంబు = ఉండునట్టిమేఘము, మైథిలి = మిథిలరాజు కూతురయిన సీతాదేవియొక్క నవనవ = మిక్కిలి క్రొత్తయిన, యౌవనంబు = ప్రాయము, అను వనంబునకున్ = అనుతోటకు, మదదంతివి = మదించిన యేనుఁగవు, నీవె కాన్ = నీవే అని, తవిలి = ఆసక్తికొని, ఎల్లప్పుడున్ = ఎప్పుడును, భజింతున్ = సేవింతును.

తా. రామా ! నిన్ను సీతాదేవి కన్నుదోయి యనెడి కలువలను వికసింపఁజేసెడు చంద్రుడుగాను, జానకీదేవి యుబ్బు చన్నులనెడి కొండల యందుండు మేఘముగాను, మిథిలాపతి కుమారి యభిప్రాయమును తోఁటకు మదపుటేనుఁగుగాను, దలచి ఎప్పుడును నిన్నే సేవించెదను.

చ. ఖరకరవంశజా విను మ ♦ ఖండిత భూతపిశాచ ఢాకినీ
జ్వరపరితాపసర్పభయ ♦ వారకమైన భవత్పదాబ్జ వి

స్ఫురదురువజ్రపంజరము ♦ జొచ్చితి నీయడ దీనమానవో
ద్ధర బిరుదాంక యేమఱకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 36

టీ. ఖరకర=సూర్యునియొక్క, వంశ = వంశమునందు, జా=పుట్టినవాఁడా, అఖండిత = కొట్టబడని, భూత = భూతములు, పిశాచ = పిశాచములు, ఢాకినిక్=ఢాకినిలు, జ్వర=జ్వరములు, పరితాప = తాపములు సర్ప = సర్పములు, భయ = భయములను, వారణము = పోగొట్టునది, ఐయిన = అయినట్టి, భవత్ = నీయొక్క, పదాబ్జ = పాదపద్మములనెడి, విస్ఫురత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, ఉరు = గొప్పదయిన, వజ్రపంజరమునన్ = వజ్రముతోఁ జేయబడిన గూటిని, జొచ్చితిని = ప్రవేశించితిని, నీయెడ = నీయందు, దీన = దీనులయిన, మానవ = జనులను, ఉద్ధర = ఉద్ధరించువాఁడనెడి, బిరుద + అంకము = బిరుదరూపమయిన చిహ్నము ఏమఱకు = కోలుపోకుము.

తా. సూర్యవంశమునఁబుట్టిన శ్రీరామా! భూతములు, పిశాచములు ఢాకినులు, తాపములు, సర్పములు మొదలగువానివలన భయములుపోగొట్టునదై, వజ్రపంజరమువలె రక్షించు నీచరణారవిందముల శరణుజొచ్చితిని. నీవు దీన మానవోద్ధారకుఁడను బిరుదు గలవాఁడవు. కాఁబట్టి నన్ను ఉద్ధరింపనివాఁడవై యాబిరుదును బోగొట్టకొనకుమా.

ఉ. జుర్రెద మీకథామృతము ♦ జుర్రెదమీపదకంజతోయము మ్ర
జుఱ్ఱెద రామనామమున ♦ జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుఱ్ఱెద జుట్టుజుట్టుఁగ రు ♦ చుల్ గనువారిపదంబు కూర్పవే
తట్టులతోడి పొత్తిడక ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 37

టీ. మీకథామృతము = మీయొక్క కథలనెడి యమృతమును, జుఱ్ఱెద = జుఱ్ఱుచున్నాను, మీపదకంజ = మీపాదారవిందముల యొక్క తోయమున్ = జలమును, జుఱ్ఱెద = జుఱ్ఱుచున్నాను, రామనామమున్ =

రామనామమునందు, జొబ్బిలుచున్న,సుధారసంబు=(స్రవించుచున్న అమృత రసమును, జుఱ్ఱెద = జుఱ్ఱుచున్నాను, జుఱ్ఱుజుఱ్ఱుగన్ = జుఱ్ఱఁగా జుఱ్ఱఁగా రుచుల్ = చవులు, కనువారి = ఎఱిగినట్టివారియొక్క, పదంబులకున్ = స్థానమునకు, తుఱ్ఱులతోడిపొత్తు = నీచులతో స్నేహము, ఇడక = పెట్టక, కూర్పవే = చేర్పుము.

తా. శ్రీరామా! నీచరిత్రములనెడి యమృతమును, నీపాదతీర్థము నామమునందు (స్రవించుచున్న యమృతమును జుఱ్ఱెదను. నీ చరిత్రాదుల యమృతమును జుఱ్ఱి రుచి తెలిసికొనిన మహనీయుల దివ్యాకృతిని నాకు గలిగింపుము. నీచులతోడి పొత్తు మాన్పుము.

ఉ. ఘోరకృతాంతవీరభట ♦ కోటికి గుండెదిగుల్ దరిద్రతా
కార పిశాచసంహరణ ♦ కార్యవినోది వికుంఠ మందిర
ద్వార కవాటభేది నిజ ♦ దాసజనావళికెల్ల ప్రొద్దు నీ
తారకనామ మెన్నుకొన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 38

టీ. నీతారకనామము = సంసారము దాటఁజేయు నీ నామమును, ఎన్నుకొనన్=తలఁచుకొనఁగా, ఘోర=భయంకరుడైన, కృతాంత=యముని యొక్క, వీర = శూరులైన, భటకోటికిన్ = కింకరుల సమూహమునకు, గుండెదిగుల్ = గుండెలోని భయము, దరిద్రతా = దారిద్ర్యముయొక్క, ఆకార = రూపముగల, పిశాచ = పిశాచమును, సంహరణ = చంపుట యనెడి, కార్య = కార్యమునందు, వినోది = క్రీడించునది, నిజ=నీవారైన దాసజన = కైంకర్యము సేయు జనులయొక్క, ఆవళికి = సమూహమునకు, ఎల్లప్రొద్దున్ = ఎల్లప్పుడును, వికుంఠ = విష్ణుదేవుని వాసస్థానమయిన పరమపదమనెడి, మందిర = గృహముయొక్క, ద్వార=వాకారమునందలి, కవాట = తలుపులు, భేది = భేదించునది.

తా. రామా! నీ తారక నామము భయంకరులయిన యమదూతలకును గుండెలదర జేయును. దరిద్రత అనెడి పిశాచమును బోఁగొట్టును. ఎల్లప్పుడును నీ దాసజనులు బరమపదమునకుఁ బోవుటకుఁగల యడ్డములను తొలఁగించును.

ఉ. విన్నపమాలకించు రఘు ♦ వీర నహిప్రతిలోకమందు నా
కన్నదురాత్ముఁడుం బరమ ♦ కారుణికోత్తమ వేల్పులందు నీ
కన్న మహాత్ముఁడుం బతిత ♦ కల్మషదూరుఁడు లేఁడు నాకుఁ వి
ద్వన్నుత నీవె నాకుఁగతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 39

టీ. రఘువీర = రఘురాజకులమునఁ బుట్టిన శూరుఁడైనవాఁడా, విన్నపము = ఒక మనవిని, ఆలకించు, ఆమనవి యేమనఁగా, బ్రతిలోకమందుఁ = ఒక్కొక్క జగత్తునందును, నాకన్నఁ = నాకంటెను, దురాత్ముఁడు = దుష్టుఁడు, నహి = లేఁడు, కారుణికోత్తమ = కరుణగలవారిలో నెల్ల శ్రేష్ఠుఁడైనవాఁడా, వేల్పులందున్ = దేవతలందు, నీకన్నన్ = నీకంటెను, మహాత్ముఁడుఁ = గొప్పవాఁడు, పతిత = పాపాత్ములయొక్క, కల్మష = పాపములను, దూరుఁడు = దవ్వగాఁ జేయువాఁడును, నాకుఁ, లేఁడు = గలుగఁడు, విద్వన్నుత = పండితులచేత కొనియాడబడువాఁడా! నీవు, నాకుఁ, గతి = దిక్కు.

తా. రఘువీరా! ఒక మనవి ఆలకింపుము. ఏలోకమందును నాకంటె దుష్టుఁడు లేఁడు. దేవతలందు నీకంటె మహాత్ముఁడును, పాపరహితుఁడును, లేఁడు. కాబట్టి దుష్టులలో శ్రేష్ఠుఁడైన నాకు దేవతలలో శ్రేష్ఠుఁడవయిన నీవే దిక్కయి ఉద్ధరింపశక్తుఁడగుదువు గాని మరియొకరు గానేరరు.

ఉ. పెంపనుతల్లివై, కలుష ♦ బృందసమాగమ మొందకుండ ర
క్షింపను తండ్రివై, మెయువ ♦ సించుదశేంద్రియరోగముల్ ని
వారింపను వెజ్జవై, కృతగు ♦ ణించి పరంబు దిరంబుఁగాఁగ స
త్సంపదలియ్య నీవెగతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 40

టీ. పెంపను = పోషింపను, తల్లివి, ఐ=అయి, కలుష=పాపముల యొక్క, బృంద=సమూహముయొక్క, సమాగమము=కూడికను. ఒందకుండన్ = చెందకుండునట్లు, రక్షింపను=కాపాడను. తండ్రివి, ఐ=అయి మెయిన్=దేహమునందు, వసించు=ఉన్నట్టి, దశేంద్రియ = పదియింద్రియములనెడి, రోగముల్=తెవుళ్ళను, నివారింపను=పోగొట్టను, వెజ్జువై=వైద్యుడవై, కృప=దయను, గురించి=కలిగి, పరంబున్=మోక్షమును, తిరంబుగాగన్=స్థిరముగునట్లుగా, సత్సంపదలు = మేలయినసంపత్తులను, ఈయన్ = ఇచ్చుటకు, నీవె, గతి = దిక్కు,

తా. పోషించుటకు తల్లివలెను, దోషములను పొందకుండరక్షింపను తండ్రివలెను, దేహమునందలి పదియింద్రియములనెడి రోగములను తొలగించుటకు వైద్యునివలెను, మేలయిన సంపదలియ్యను నీవేనాకుదిక్కు.

ఉ. కుక్షినజాండపంక్తులొన ♦ గూర్చి చరాచరజంతుకోటి సం
రక్షణసేయు తండ్రివి ప ♦ రంపర నీతనయుండనైన నా
పక్షము నీవుగావలదె ♦ పాపము లెన్నియొనర్చినన్ జగ
ద్రక్షక కర్తవీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 41

టీ. కుక్షిన్ = ఉదరమునందు, అజాండ = బ్రహ్మాండములయొక్క పంక్తులు = సమూహములు, ఒనగూర్చి = పొందికపరచి అనుట, చర = చరించునట్టి చేతనములును, అచర = చరింపని చేతనములును, జంతు = ప్రాణులయొక్క, కోటిన్ = సమూహమును, రక్షణ = కాపాడుటను, చేయుతండ్రివి=చేయునట్టితండ్రివి, పరంపరగా=వరుసగా = తరతరముగా, నీతనయుండను = నీకొడుకును, ఐన = ఐనట్టి, నాపక్షము = నాయొక్క పాలిటివాడవు, ఎన్నిపాపములు, ఒనర్చినన్ = నేను చేసినను, నీవు, కావలదా = కావలదా, జగత్ = లోకములను, రక్షణ = రక్షించుటయందు, కర్త=కర్తయైనవాడవు, నీవుకద = నీవేకదా.

తా. కుక్షిలోపల బ్రహ్మాండసమూహములను పొందికగా పెట్టుకొని చేతనములును, అచేతనములైన సకల ప్రాణిసమూహములను రక్షించునట్టి తండ్రివి కాబట్టి తరతరముగ నీకొడుకైయున్న నాపాలిట నీవుపక్షపాతి వైయుండవలయును. నేను పాపములు చేసితినని నీవు నన్ను విడువరాదు. ఎన్ని పాపములు చేసినను లోకమెల్ల రక్షించువాడవు నీవొక్కడవే కనుక నీవే నన్ను కాపాడవలయును.

ఉ. గద్దరియోగిహృత్కమల ♦ గంధ రసానుభవంబుఁజెందు పె
న్నిద్దపుగండుఁ దేఁటి ధర ♦ ణీసుతకౌఁగిలి పంజరంబునన్
ముద్దులుగుల్కు రాచిలుక ♦ ముక్తినిధానము రామరాఁగదే
తద్దయు నేఁడు నాకడకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 42

టీ. గద్ధరి = దిట్టమైన, యోగి=యోగిశ్రేష్ఠులయొక్క, హృత్ = హృదయమనెడి, కమల = తామరయందలి, గంధ = వాసనతోఁ గూడిన, రస = మకరందముయొక్క, అనుభవంబున్ = ఆస్వాదమును, చెందు = పొందునట్టియు, పెను = మిక్కిలి, నిద్దపు = నిగనిగ యనెడి మిసమిసగల, గండు = మదించిన, తేఁటి = తుమ్మెదయైనవాఁడు, ధరణీసుత=సీతాదేవి యొక్క, కౌఁగిలి = ఆలింగనమనెడి, పంజరంబునన్ = గూటియందు, ముద్దులుగుల్కు = మనోజ్ఞముగా నుండు, రాచిలుక = రాచచిలుక, ముక్తినిధానము = మోక్షముండెడి చోటు, రామ = శ్రీరామా, నా కడకున్=నాయొద్దకు, నేఁడు, తద్దయున్ = మిక్కిలి, రాఁగదే = రమ్ము.

తా. తామరలయందలి తేనెను అనుభవించు తుమ్మెదవలె, యోగి శ్రేష్ఠుల హృదయమందు భక్తిరసములు అనుభవించువాఁడును, గూటియందలి రాచిలుకవలె సీతాదేవి కౌఁగిలియందు సొంపు గులుకువాఁడును, మోక్ష మిచ్చువాఁడును అగు శ్రీరామా! నేడు నాయొద్దకు వేగరమ్ము.

ఉ. కలియుగమర్త్యకోటి నినుఁ ♦ గన్గొనరానివిధంబొ భక్తవ
త్సలత వహింపవో చటుల ♦ సాంద్రవిపద్దశవార్ధిగ్రుంకుచోఁ

బిలిచినఁ బల్కు వింతమఱ ♦ పే నరులిట్లనరాదు గాక నీ
తలఁపున లేదె సీత చెఱ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 43

టీ. కలియుగ=కలియుగమందలి, మర్త్యకోటి=మనుష్యసమూహము నిన్ను, కన్గొనరానివిధంబొ=తెలిసికొనరానివిధమో, భక్తవత్సలత=భక్తుల యెడల వాత్సల్యము గలిగియుండుటను, వహింపవో=తాల్పవో, చటుల = మిక్కిలి అయిన, సాంద్ర=దట్టమైన, విపత్=ఆపదలయొక్క, దశ=అవస్థ యనెడి, వార్ధిన్ = సముద్రమునందు, క్రుంకుచోన్ = నేను మునుఁగునపుడు పిలిచినన్ = నిన్ను పిలువఁగా పల్కు=పల్కవు, ఇంతమఱపే=ఇంతవన్నుఁ మఱచిపోవుటయా, నరులు=నానాటిమనుష్యులు, ఇట్లు=ఈప్రకారము ఇంత మఱుపాయనకు, అనరాదు గాక=చెప్పరాదుగాని, నీతలంపునన్ = నీచింత యందు, సీత చెఱ=రావణునిచేత సీత పొందిన చెఱ, లేదె=లేదా.

తా. రామా ! నేను మిక్కిలి ఆపత్సముద్రమున మునుగుచు నిన్నెంత పిలిచినను మాఱుపలుకవు యిదేల ? కలియుగమందు మనుష్యులకు కనపడ రాదనియా? లేక భక్తజనులయెడల నీకు వాత్సల్యముకలుగదా? ఇటులున్నను మఱచిపోవచ్చునా ? నీకు మఱపని మాటలు చెప్పరాదు. సీతాదేవికి కలిగిన చెఱను మఱువవుగదా? అట్టి మా చెఱకును నీకు మఱపు ఎక్కడిది ?

చ. జనవర మీకథాళి విన ♦ సైఁపక కర్ణములందు ఘంటికా
నినద వినోదముల్ సలుప ♦ నీచువకుఁ వరమిచ్చినావు ని,
న్ననయమునమ్మికొల్చిన ♦ మహాత్మున కేమియొసంగెదో సనం
దనసుతమూర్తినంగుమయు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 44

టీ. జనవర = ఓరాజా! మీకథాళి = మీకథయొక్క సమూహము! వినన్ = వినుటకు, సైఁపక = ఓర్వక, కర్ణములందున్ = చెవులయందు, ఘంటికా = గంటలయొక్క, నినద = శబ్దములయొక్క, వినోదముల్ = వేడుకలను, సలుపు నీచులకున్ = చేయుచున్న అల్పునికి, వరము = కోరిన

కోరిక, ఇచ్చినావు, నిన్ను. అనయముగ = ఎప్పుడును, నమ్మి, కొల్చిన మహాత్ములకుఁ = సేవించునట్టి మహనీయులకు, ఏమి? ఒసంగెదవో = ఇచ్చెదవో, సనందననుత = సనందనుఁడు అను ఋషిచేత కొనియాడఁ బడినవాఁడా, మాకుఁ, ఒసంగుమయ్య = ఇయ్యవయ్యా.

తా. ఓరాజా! మీకథలను వినుటకు ఓర్వక చెవులయందు ఘంటల ధ్వనియొక్క వేడుకలను పలుకు నీమునికి కోరినవరము ఇచ్చినావు. ఎప్పుడు నిన్ను నమ్మి సేవించునట్టివారికి ఏమియిచ్చెదవో? సనందనుండను ఋషిచేత కొనియాడఁబడినవాఁడా! వారికిచ్చినట్లే నాకును నిమ్ము.

ఉ. పాపములొందువేళ రణ ♦ పన్నగ భూతభయ జ్వరాదులం
దాపద నొందువేళ భర ♦ తాగ్రజ మిమ్ముభజించువారికిం
బ్రాపుగ నీవుఁదమ్ముఁడిరు ♦ పక్కియలంజని తద్విపత్తి సం
తాపముమాన్చి కాతువఁట ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 45

టీ. పాపములు, ఒందువేళఁ = పొందెడి సమయమందు, పన్నగ = సర్పము, భూతభయ = భూతములవలన కలుగు భయమును, జ్వర = జ్వరములు, ఆదులందుఁ = మొదలయినవానియందు, ఆపదఁ = విపత్తును, ఒందువేళఁ = పొందుసమయమునను, భరతాగ్రజ = భరతునికి అన్నయైన శ్రీరామా, మిమ్ముఁ = మిమ్ము, భజించువారికిఁ = కొలుచువారికి, నీవు = నీవును, తమ్ముఁడు = తమ్ముడయిన లక్ష్మణుఁడును, ఇరుపక్కియలఁ = రెండుప్రక్కలను, ప్రాపుగఁ = సహాయముగ, చని = పోయి, తత్ = వారియొక్క, విపత్తి = ఆపదచేతనైన, సంతాపముఁ = ఉడుకును, మాన్చి = పోఁగొట్టి, కాతువఁట = కాపాడుదువందురు.

తా. దశరథరామా! పాపములుపొందునప్పుడును, యుద్ధము, సర్పములు, భూతములు, జ్వరములు మొదలయినవాటిచేత ఆపద కలిగినప్పుడును, నిన్ను గొలుచునట్టివారికి సహాయము సేయుటకుఁబోయి నీవును, నీతమ్ముఁడైన లక్ష్మణుఁడును రెండు ప్రక్కల నిలిచి వారి యాపదలను పోఁగొట్టి రక్షింతువని లోకులు చెప్పుదురు. కాఁబట్టి నన్నును కాపాడవలయును.

చ. అగణితజన్మకర్మదురి ♦ తాంబుధిలోఁ బహుదుఃఖవీచికల్
దెగిపడనీఁదలేక జగతీ ♦ ధవ నీపదభక్తినావచేఁ
దగిలి తరింపఁగోరితిఁ బ ♦ దంపడి నాదుభయంబుమాన్పవే
తగదని చిత్తమందిడక ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 46

టీ. జగతీధవ = భూనాథా, అగణిత = లెక్కింపరాని, జన్మ = జన్మము లందలి, కర్మ = కర్మపరంపరచేఁ గల్గిన, దురిత = పాపముల నెడి, అంబుధిలోన్ = సముద్రమందు, బహు = అనేకము లయిన, దుఃఖ = దుఃఖముల నెడి, వీచికల్ = అలలను, తెగిపడన్ = కడచునట్లు, ఈఁదలేక = ఈఁదజాలక, పదంపడి = పిమ్మట, నీపదభక్తినావచేన్ = నీయొక్క పాదములందలి భక్తియనెడి ఓడచేత, తగిలి = ఆసక్తితోడ, తరింపఁగోరితిన్ = దాటను ఇచ్చగించితిని, తగదు అని = తగినది కాదు అని, చిత్తమందు = నీమనస్సునందు, ఇడక = ఉంచుకొనక, నాదుభయంబున్ = నాయొక్క భయమును, మాన్పవే = పోఁగొట్టుము.

తా. భూనాథా! లెక్కింపరాని జన్మములయందలి కర్మపరంపరలచే గలిగిన పాతకములు సముద్రమువలె అపారమై నాయందుంట పోఁగొట్టుకొనుటకు శక్యము గాక, నీయందలి భక్తి గలిగి ఈఁదరాని సముద్రమును ఓడచే సులువుగా దాటునట్లు తొలఁగింపరాని నాపాపములను సులువుగా నీభక్తిచేఁ బోఁగొట్టుకొనఁగోరితిని. కావున శరణుజొచ్చిన నాయొక్క భయమును పోఁగొట్టుమా!

ఉ. నేనొనరించుపాపము ల ♦ నేకములైనను నాదుజిహ్వకుం
బానకమయ్యె మీపేరము ♦ పావననామము దొంటి చిల్క 'రా
మా' యనఁగాశ్రుమన్నతుని ♦ మాటకు సద్గతిఁ జెందెఁ గావునన్
దాసిఁదరింపఁ గోరెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 47

టీ. నేను ఒనరించు పాపములు=చేయునట్టి పాపములు, అనేకములు=పెక్కులు, ఐనను, నామజిహ్వకు=నాయొక్క నాలుకకు, మీపరమపావననామము=మీయొక్క మిక్కిలి పవిత్రమైన పేరు, పానకముఅయ్యెన్ = పానకమువలె రుచియైనదని, తొంటిచిల్క = పూర్వకాలపుచిలుక, రామా నన్ను కావుము = నన్నురక్షింపుము, అన్నతుదిమాటలకున్ = అనిపలికినట్టి కడపటిపలుకులకు, సద్గతిన్ = మోక్షమును, చెందెన్=పొందెను, కావునన్= కనుక దానిన్=ఆరామనామమును, ధరింపన్ కోరెదను = తాల్చుటకుయిచ్ఛగించెదను.

తా. దశరథరామా! పాపము లనేకములు నేను చేయుచున్న వాఁడను. ఇట్టి పాపాత్ముఁడనైనను నీదివ్యనామము ఉచ్చరించుటకు నానాలుకకు పానకమువలె మిక్కిలి రుచ్యమైనది. ఎట్లనఁగా పూర్వమొకచిలుక 'రామా నన్నుఁగావుము' అని కడపట నొక్కమాట చెప్పగానే మోక్షము నొందెగదా ? అట్టి స్థితిని ఇచ్చునది గాన నాకు అతిరుచి గల నీనామము పఠించెదను.

చ. పరధనముల్ హరించి పర ♦ భామలనంటిపరాన్నమబ్బినన్
మురిపముగానిమీఁదనగు ♦ మోసమెఱుంగదు మానసంబుదు
స్తరమిది కాలకింకర గ ♦ దాహతి పాల్పడనీక మమ్ము నే
తతిఁదరిజేర్చి కాచెదవొ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 48

టీ. పరధనముల్ = ఇతరుల ధనములను, హరించి = అపహరించి, పరభామలన్=ఇతరుల యిల్లాండ్రను, అంటి = తాకి ; పరాన్నము = ఇతరులకూడు, అబ్బినన్ = దొఱకఁగా, మురిపము కాని = విలాసమే కాని, మీఁదన్=పిమ్మట, అగుమోసము = కలుగునట్టి, మోసంబు, మానసంబు = మనస్సు, ఎఱుంగదు, ఇది = ఇట్లు తెలియకుండుట, దుస్తరము = తరింపరానిది, కాలకింకర = యమదూతలయొక్క, గదా = గదలయొక్క హతి = దెబ్బలయొక్క , పాలు = అధీనత, పడనీక = పొందనీక మమ్మున్, ఏతతిన్ = ఎప్పుడు, దరిజేర్చి కాచెదవో = రక్షింతువో.

తా. దశరథరామా! పరులధనములను దొంగిలించుట, పర స్త్రీలను గూడుట, పరాన్నమును దినుట మొదట సుఖముగా నుండినను వెనుక నరకము గలిగించును. ఇది మనస్సునకు తెలియదు. మనస్సును జయించుట కష్టము గనుక మనస్సుపోయిన దారిని పోయి నరకమున బడకుండునట్లు మమ్ము నెప్పుడు కడతేర్చి కాపాడెదవో!

ఉ. చేసితి ఘోరకృత్యములు ♦ చేసితి భాగవతాపచారముల్
చేసితి నన్యదైవములఁ ♦ జేరి భజించిన వారిపొందు నేఁ
జేసిన నేరముల్ దలఁచి ♦ చిక్కులఁబెట్టకుమయ్యయయ్య నీ
దాసుఁడనయ్య భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 49

టీ. ఘోరకృత్యములు = భయంకరములయిన కార్యములను, చేసితిని భాగవతాపచారముల = భాగవత జనులయెడ అపరాధములను, చేసితిని, అన్యదైవములన్ = ఇతర దేవతలను చేరి ఆశ్రయించి, భజించిన వారి పొందును = కొలచినట్టివారి సాంగత్యమును, చేసితిని, నేనే = నేను, చేసిన నేరములు = కావించినట్టి తప్పులను, తలఁచి = ఎంచి, చిక్కులను పెట్టకుము = సంకటములందు దగిలింపకుమయ్యా, అయ్యా = అయ్యా, నీదాసుఁడను యయ్యా = నీయొక్క దాసుఁడను.

తా. దశరథరామా! నేను ఘోరమైన కార్యములను చేసితిని. భాగవతులకు నపచారములు చేసితిని. అన్యదైవములను గొలుచువారితో సాంగత్యము జేసితిని. నేను చేసినట్టి తప్పులను తలఁచి సంకటములను పెట్టవద్దు. నేను నీకు దాసుఁడను.

చ. నరులధనంబుఁజూచి పర ♦ భామలఁజూచి హరింపఁగోరు మ
ద్గురుతరమానసంబనెడు ♦ దొంగనుబట్టి నిరూఢదాస్య వి
స్ఫురితవివేక పాశములఁ ♦ జుట్టి భవచ్చరణంబనే మరు
త్తరువునఁ గట్టివేయఁగదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 50

టీ. పరులధనంబుఁ = ఇతరులసొత్తును, చూచి, పరభామలన్ = పరస్త్రీలను, చూచి, హరింపఁ = అపహరించుటకు, కోరునట్టి, మత్ = నాయొక్క, గురుతర = మిక్కిలి గొప్పదైన, మానసంబు = మనస్సు, అనెడు దొంగను = అనునట్టి దొంగను, పట్టి = పట్టుకొని, నిరూఢ = మిక్కిలి పెరిగిన, దాస్య = కైంకర్యమునందు, విస్ఫురిత = మిక్కిలి ప్రకాశించిన, వివేక = తెలివియనెడి, పాశములఁ = త్రాళ్ళచేత, చుట్టి = బంధించియనుట, భవచ్చరణంబు = నీపాదము, అనే మరుత్ తరువునఁ = అనెడి దేవతావృక్షమున, కట్టివేయఁగదె = బంధించివేయుమా.

తా. ఇతరుల సొత్తులను, స్త్రీలను చూచి అపహరించుటకు కోరునట్టి నాయొక్క మనస్సు అనునట్టి దొంగనుపట్టుకొని నీయొక్క కైంకర్యముచే ప్రకాశించునట్టి తెలివియనెడి కల్పవృక్షమునకు గట్టివేయుమా.

చ. సలలిత రామనామ జప ♦ సారమెఱుంగను గాశికాపురీ
నిలయుఁడ గానుమీచరణ ♦ నీరజరేణుమహాప్రభావముం
దెలియనహల్యగాను జగ ♦ తీవర నీదగు సత్యవాక్యముం
దలఁపఁగ రావణాసురుని ♦ తమ్ముఁడఁగాను భవద్విలాసముల్
తలఁచి నుతింపనెంతరమె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 51

టీ. సలలిత = మిక్కిలి ఒప్పుచున్న, రామనామ = రామనామము యొక్క, జప = జపముయొక్క, సారము = సత్తువను, ఎఱుంగను = తెలియుటకు, కాశికాపురీనిలయుఁడను = కాశీపట్టణము వాసస్థానముగాఁగల శివుఁడను గాను, మీ చరణ నీరజ = మీ పాదపద్మములయొక్క, రేణు = దుమ్ము యొక్క, మహాప్రభావముఁ = గొప్ప మహాత్మ్యమును, తెలియన్ = తెలియుటకు, అహల్యము గాను = అహల్యను కానేరను, జగతీవర = భూనాథా, నీదగు సత్యవాక్యము = నీదైనట్టి నిజమైన మాటను, తలపగఁ = ఎన్నుటకు, రావణాసురుని తమ్ముఁడను = విభీషణుఁడను కాను, భవత్ విలాసముల్ =

నీయొక్క మహాత్త్వపు వైచిత్ర్యములు, తలఁచి = ఎన్ని, నుతింపఁగన్ = పొగడుటకు, నాతరమె = నాకు శక్యమా ! ,

తా. దశరథరామా! నీనామము జపముచేయుటవలని పస శివునికే తెలియును గాని నాకు తెలియదు. నీపాదధూళియొక్క ప్రభావము అహల్యకే తెలియును. నీసత్యసంధత్వము విభీషణునకే తెలియును. కాని నీ లీలలు నాబోటివానికి తెలిసి వర్ణించుటకు అలవి కాదు.

ఉ. పాతకులైన మీకృపకుఁ ♦ బాత్రులు కారె తలంచిచూడఁ జ
టాత్రికిఁ గల్గెఁ బావనమ ♦ రాతికి రాజ్యసుఖంబు గల్గె దు
ర్జాతికిఁ బుణ్యమబ్బెఁ గపి♦జాతి మహత్త్వము నొందెఁ గావునన్
దాతవ యెట్టివారలకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 52

టీ. పాతకులైనన్ = పాపాత్ములైనను, మీకృపకు = మీదయకు, పాత్రులు కారె = అర్హులే కారా, తలంచిచూడఁగన్ = ఎన్ని చూడఁగా (పాతకులు నిదయకు పాత్రులో కారోయని విచారించిచూడఁగా యనుట) చటాత్రికిన్=చట్టురాయిగానున్న, అహల్యకు, పావనము = పవిత్రత్వము, కల్గెన్ = కలిగెను, అరాతికిన్=శత్రువైన విభీషణునికి, రాజ్యసుఖంబు = రాజ్యప్రాప్తియనెడి సుఖము, కల్గెన్ = కల్గెను, దుర్జాతికి = నీచజాతుల వారికిని, పుణ్యము = సుకృతము, అబ్బెన్ = లభించెను, కపిజాతి=వానర జాతి, మహత్త్వము = మహిమను, పొందెన్=ఒందెను, కావునన్=కనుక, ఎట్టివారలకున్ = ఎంతటివారికైనను, దాతవ = కోరిన కోర్కెలు ఇచ్చువాఁడవే.

తా. దశరథరామా! పాపాత్ములైనను మీకృపకు పాత్రులై యున్నారు. ఎట్లనగా రాయిగానుండిన అహల్య నీపాదరజముచే నిజరూప మొంది కృతార్థురాలైనది. పగవారివర్గములోఁ జేరిన విభీషణుఁడు నీవలన లంకారాజ్యము నొందినాడు. జటాయువు, శబరి మొదలయిన తక్కువ జాతులవారును నీయనుగ్రహము గలిగినది. సుగ్రీవాదులైన వానరులకుఁగూడ

టీ. పరులధనంబుఁ = ఇతరులసొత్తును, చూచి, పరభామలన్ = పరస్త్రీలను, చూచి, హరింపఁగ = అపహరించుటకు, కోరునట్టి, మత్ = నాయొక్క, గురుతర = మిక్కిలి గొప్పదైన, మానసంబు = మనస్సు, అనెడు దొంగను = అనునట్టి దొంగను, పట్టి = పట్టుకొని, నిరూఢ = మిక్కిలి పెరిగిన, దాస్య = కైంకర్యమునందు, విస్ఫురిత = మిక్కిలి ప్రకాశించిన, వివేక = తెలివియనెడి, పాశములఁ = త్రాళ్ళచేత, చుట్టి = బంధించియనుట, భవచ్చరణంబు = నీపాదము, అనే మరుత్ తరువునఁ = అనెడి దేవతావృక్షమున, కట్టివేయఁగదె = బంధించివేయుమా.

తా. ఇతరుల సొత్తులను, స్త్రీలను చూచి అపహరించుటకు కోరునట్టి నాయొక్క మనస్సు అనునట్టి దొంగనుపట్టుకొని నీయొక్క కైంకర్యముచే ప్రకాశించునట్టి తెలివియనెడి కల్పవృక్షమునకు గట్టివేయుమా.

చ. సలలిత రామనామ జప ♦ సారమెఱుంగను గాశికాపురీ
నిలయుఁడ గానుమీచరణ ♦ నీరజరేణుమహాప్రభావముం
దెలియనహల్యగాను జగ ♦ తీవర నీదగు సత్యవాక్యముం
దలఁపఁగ రావణాసురుని ♦ తమ్ముఁడఁగాను భవద్విలాసముల్
తలఁచి నుతింపనెంతరమె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 51

టీ. సలలిత = మిక్కిలి ఒప్పుచున్న, రామనామ = రామనామము యొక్క, జప = జపముయొక్క, సారము = సత్తువను, ఎఱుంగను = తెలియుటకు, కాశికాపురీనిలయుఁడను = కాశీపట్టణము వాసస్థానముగాఁగల శివుఁడను గాను, మీచరణ నీరజ = మీపాదపద్మములయొక్క, రేణు = దుమ్ముయొక్క, మహాప్రభావముఁ = గొప్ప మాహాత్మ్యమును, తెలియన్ = తెలియుటకు, అహల్యను గాను = అహల్యను కానేరను, జగతీవర = భూనాథా, నీదగు సత్యవాక్యము = నీదైనట్టి నిజమైన మాటను, తలపఁగ = ఎన్నుటకు, రావణాసురుని తమ్ముఁడను = విభీషణుఁడను కాను, భవత్ విలాసముల్ =

నీయొక్క మహాత్త్వపు వైచిత్ర్యములు, తలఁచి = ఎన్ని, నుతింపన్ = పొగడుటకు, నాతరమె = నాకు శక్యమా !.

తా. దశరథరామా! నీనామము జపముచేయుటకలని పస శివునికే తెలియును గాని నాకు తెలియదు. నీపాదధూళియొక్క ప్రభావము అహల్యకే తెలియును. నీసత్యసంధత్వము విభీషణునకే తెలియును. కాని నీ లీలలు నాబోటివానికి తెలిసి వర్ణించుటకు అలవి కాదు.

ఉ. పాతకులైన మీకృపకుఁ ♦ బాత్రులు కారె తలంచిచూడఁ జ
టాత్రికిఁగల్గెఁ బావన మ ♦ రాతికి రాజ్యసుఖంబుగల్గె దు
ర్జాతికిఁబుణ్యమబ్బెఁగపి♦జాతిమహత్త్వమునొందెఁగావునన్
దాతవ యెట్టివారలకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 52

టీ. పాతకులైనన్ = పాపాత్ములైనను, మీకృపకు = మీదయకు, పాత్రులు కారె = అర్హులే కారా, తలంచిచూడన్ = ఎన్నిచూడఁగా (పాతకులు నిదయకు పాత్రులో కారోయని విచారించిచూడఁగా ననుట) చటాత్రికిన్=చట్టురాయిగానున్న, అహల్యకు, పావనము = పవిత్రత్వము, కల్గెన్ = కలిగెను, అరాతికిన్=శత్రువైన విభీషణునికి, రాజ్యసుఖంబు = రాజ్యప్రాప్తియనెడి సుఖము, కల్గెన్ = కల్గెను, దుర్జాతికి = నీచజాతుల వారికిని, పుణ్యము = సుకృతము, అబ్బెన్ = లభించెను, కపిజాతి=వానర జాతి, మహత్త్వము = మహిమను, పొందెన్=ఒందెను, కావునన్=కనుక, ఎట్టివారలకున్ = ఎంతటివారికైనను, దాతవ = కోరిన కోర్కెలు ఇచ్చువాఁడవే.

తా. దశరథరామా! పాపాత్ములైనను మీకృపకు పాత్రులై యున్నారు. ఎట్లనగా రాయిగానుండిన అహల్య నీపాదరజముచే నిజరూప మొంది కృతార్థురాలైనది. పగవారివర్గములోఁ జేరిన విభీషణుఁడు నీవలన లంకారాజ్యము నొందినాడు. జటాయువు, శబరి మొదలయిన తక్కువ జాతులకును నీయనుగ్రహము గలిగినది. సుగ్రీవాదులైన వానరులకుఁగూడ

మహాత్మ్యము గలిగినది. ఇవన్నియుఁజూడఁగా నీవు ఎక్కువలు తక్కువలు పాటింపక ఎట్టివారికైన కోరిన కోర్కెలనిచ్చు దాతవని తెలియు చున్నది. కాఁబట్టి నాకోర్కెయు నొసఁగుము.

ఉ. మామక పాతకవ్రజము ♦ మాన్ప నగణ్యము చిత్రగుప్తులే
మేమని వ్రాతురో శమనుఁ ♦ డేమివిధించునో కాలకింకర
స్తోమ మొనర్చు టేమొ వినఁ ♦ జొప్పడదింతకుమున్నె దీనచిం
తామణి యెట్లుగాచెదవొ ♦ దాశరథీకరుణాపయోనిధీ. 53

టీ. మామక = నాయొక్క, పాతకవ్రజము = పాపసమూహము, మాన్పన్ = పోగొట్టుటకు, అగణ్యము = లెక్కింపరానిది, చిత్రగుప్తులు= యముని యొద్దనుండి జీవులపుణ్యపాపముల లెక్కలువ్రాయుచుండుకరణములు, ఏమి ఏమి అని = ఏవిధముగా, వ్రాతురో = వ్రాయుదురో, శమనుఁడు = యముఁడు, ఏమి = ఏఫలము, విధించునో = ఆజ్ఞాపించునో, కాలకింకరస్తోమ = యమదూతల సమూహము, ఒనర్చుట = చేయుట, ఏమొ = ఏదియో, వినన్ = వినుటకు, చొప్పడదు = సరిపడదు, ఇంతకుమున్నె = దీనికిపూర్వమే దీనచింతామణి = దీనులైనవారికి చింతామణి వలె కోరికకోర్కెలు ఇచ్చువాఁడా, ఎట్లు = ఏవిధముగ, కాచెదవొ = కాపాడెదవో.

తా. దశరథరామా! నాపాపములు పోఁగొట్టుటకుఁ జాల కలవు. చిత్రగుప్తుఁడేమి వ్రాయునో? యముఁడేమి విధించునో? కాలకింకరు లేమి చేయుదురో? ఇంతకుఁ బూర్వమే దీనరక్షణకై కంకణముఁ గట్టు కొని కోర్కెలు దీర్చు నివెట్లు కాపాడెదవో తెలియరాదు.

ఉ. దాసినచుట్టమా శబరిఁ ♦ దాని దయామతి నేలినావు నీ
దాసునిదాసుఁడాగుహుఁడు ♦ తావకదాస్య మొసంగినావు నే

జేసినపాపమో వినుతి ♦ సేసినఁగావవు కావుమయ్య నీ
దాసులలోన నేనొకఁడ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 54

టీ. శబరి, దాసిన=దగ్గతిన, చుట్టమా =వియ్యమా. దయామతిన్= దయతోఁగూడిన బుద్ధితో, ఏలినావు = రక్షించినావు, గుహుఁడు, నీ దాసుని దాసుఁడా = సేవకుని సేవకుఁడా, తావక దాస్యము = నీదైన దాస్యమును, ఒసంగినావు = ఇచ్చితివి, వినుతిన్=స్తోత్రమును, చేసినన్ = నేనుచేసినప్పటికిని, కావవు = రక్షింపవు, నేన్ = నేను, చేసినపాపమో= చేసికొన్నట్టిదోషమో, నీదాసులలోనన్ = నీసేవకులలోపల, నేను ఒక్కఁడను, కావవయ్య=రక్షింపుమా.

తా. రామా ! శబరి నీకు దగ్గఱచుట్టము కాకపోయినను, దానిని దయతోఁ గాపాడితివి. గుహుఁడు నీదాసునికిఁగూడఁ దాసుఁడుగాడు కాకపోయినను దానినిగాఁజేసికొంటివిగాన నేను నీదాసవర్గములో ఒకఁడు గానున్నాడను. మరియు నిన్ను స్తోత్రముచేసినను నేను చేసికొన్నపాపమో కాని నన్ను గాపాడవు. ఇకనైనను కాపాడుమా !

ఉ. దీక్షవహించి నాకొలఁది ♦ దీనుల నెందఱిఁగాచితో జగ
ద్రక్షక తొల్లి యాద్రుపద ♦ రాజతనూజ తలంచినంతనే
యక్షయమైన వల్వలిడి ♦ తక్కట నా మొఱఁ జిత్తగించి
ప్రత్యక్షముగావవేమిటికి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. • 55

టీ. జగద్రక్షక = జగమును రక్షించువాఁడా, దీక్షన్=నియమమును వహించి = తాల్చి, నాకొలఁదిదీనులన్ = నన్నుబోలిన దిక్కులేనివారిని ఎందఱిని, కాచితో = కాపాడితివో, తొల్లి = ముందు, ఆద్రుపదరాజ తనూజ = ద్రుపదరాజకూతురైన యాద్రౌపది, తలంచినంతనే = స్మరించినంత మాత్రముననే, అక్షయము = తరుగనివి, అయినవల్వలు = అయినట్టి చీరలు, ఇడితి=ఇచ్చితివి, అక్కట=అయ్యో, నా మొఱన్=నామనవిని

చిత్తగించి = ఆలకించి, ప్రత్యక్ష = సాక్షాత్తుగా, కావవు ఏమిటికి = ఏల కాపాడవు.

తా. జగద్రక్షకా! నీవు ఆశ్రితులను రక్షించు నియమమును పూని యెందఱిని కాపాడితివో నాకు తెలియదు. నేను వినినంతవఱకు పూర్వము ద్రౌపది దుర్యోధనునిసభలో చీరలు ఒలుచునపుడు నిన్ను స్మరించినంతనే లెక్కలేని చీరలిచ్చితివఁట. అయ్యో! నామనవిచిత్తగించి నామొఱనాలించి నన్నేల కాపాడవు?

ఉ. నీలఘనాభమూర్తివగు ♦ నిన్నుఁ గనుంగొనఁగోరి వేడినన్
జాలముసేసిడాఁగెదవు ♦ సంస్తుతికెక్కిన రామనామ మే
మూలను దాఁచుకోఁగలవు ♦ ముక్తికిఁ బ్రాపది పాపమూలకు
ద్దాలముగాదె మాయెడల ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 56

టీ. నీల=నల్లని, ఘన = మేఘముతో, అభ = సాటియైన, మూర్తి దేహముగలవాఁడవు, అగు నిన్నున్=అయినట్టి నిన్ను, కనుంగొనన్=చూచుటకు, కోరి = అపేక్షించి, వేఁడినన్=ప్రార్థింపఁగా, జాలముచేసి=మాయచేసి, డాఁగెదవు = దాచుకొనెదవు, సంస్తుతికిన్=పొగడ్తకు, ఎక్కినరామనామము = వచ్చినట్టిరామనామము, ఏమూలను = ఏమూలయందు, దాచుకోఁగలవు = దాచుకొననేర్తువు, అది = ఆరామనామము, మాయెడలన్ మావిషయమందు, ముక్తికిన్ = మోక్షమునకు, ప్రాపు=ఊతపట్టు, పాప=పాపములయొక్క, మూల=వేళ్ళకు, కుద్దాలము=గుద్దలి, కాదె=కదా.

తా. రామా! నల్లని మేఘమువలె నీవిగ్రహమును కన్నారఁ జూడవలయునని యెంతప్రార్థించినను మాయముచేసి దాఁచుకొనెదవు. మంచిది. నీవుదాగినను ప్రసిద్ధమై వ్యాపించియున్న నీ రామనామమును నీవు యెక్కడను దాఁచిపెట్టుకొనలేవు. మా పాపములను, గుద్దలి వేళ్ళను పెల్లగించునట్లు సమూలముగాఁ బోఁగొట్టి మోక్షమిచ్చుటకు అది యొక్కటియే కాన అదియే చాలును.

చ. వలదు పరాకు భక్తజన ♦ వత్సల నీచరితంబు వమ్ముగా
వలదు పరాకు నీబిరుదు ♦ వజ్రమువంటిది కావకూరకే
వలదు పరాకు నాదురిత ♦ వార్థికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలఁతుమెకా నిరంతరము ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 57

టీ. భక్తజన = భక్తసమూహమునకు. వత్సల = వాత్సల్యము కలవాఁడా, నీచరితంబు = నీచరిత్ర, వమ్ము = వ్యర్థము, కావలదు=కాకుండ నిమ్ము, పరాకు=హెచ్చరిక, నీబిరుదు=ఆశ్రితరక్షకుఁడు అనెడి బిరుదము, వజ్రమువలె గట్టిది. కావక = (వమ్ము) రక్షింపక, ఊరక = వ్యర్థముగా, వలదు = వద్దు, పరాకు = హెచ్చరిక, నాదురితవార్ధికిన్ = నాపాపసముద్రమునకు. తెప్పవుగాన్ = తెప్పగా, మనంబులోన్ = మనస్సునందు నిరంతరము=ఎప్పుడును, తలతుమెకా=తలంతుము సుమా.

తా. భక్తులయందు దయగలవాఁడా! ఆశ్రితరక్షణాదులు దెలుపు నీచరితములను, ఆశ్రితరక్షకుండని వజ్రమువలె అభేద్యమైన నీబిరుదును వ్యర్థముగను. అట్లుచేయవలదు, జాగ్రత్తసుమీ, నిన్ను సముద్రము దాటించు తెప్పవలె నాపాపములను పోగొట్టువానినిగా మనస్సులో ఎప్పుడును తలంతును.

ఉ. తప్పులెఱుంగలేక దురి ♦ తంబులు సేసితినంటి నీవు మా
యప్పవుగావుమంటి నికఁ ♦ నన్యులకున్ నుదురంటనంటి నీ
కొప్పిదమైన దాసజను ♦ లొప్పినబంటుకు బంటవంటి నా
తప్పులకెల్ల నీవెగతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 58

టీ. తప్పులు = దోషములను, ఎఱుంగలేక = తెలిసికొనలేక, దురితంబులు=పాపములను, సేసితిన్ అంటి = చేసినాను అని చెప్పితిని. నీవు, మాయప్పవు = మాతండ్రివి కావుము, అంటి = రక్షింపుమని చెప్పితిని, ఇకన్, ను, అన్యులకున్ = ఇతరులకు, నుదురు = నెత్తిని, అంటను అంటి = తాకను అని చెప్పితిని, నీకు, ఒప్పిదమైన = తగినట్టివారైన, దాసజనులు =

సేవకసమూహములు, ఒప్పిన బంటుకున్ = సమ్మతించి స్వీకరించిన సేవకునికి, బంటును అంటి = సేవకుఁడను అంటిని, నాతప్పులకును ఎల్లన్ = నాయన్ని దోషములకును, నీవె, గతి = దిక్కు.

తా. దశరథరామా ! దోషము లని తెలిసికొనలేక పాపములుచేసితిని. నీవు మాతండ్రివి. రక్షింపుమా, ఇఁక మీఁద ఇతరులకు నుదురు తాకి యంజలిచేయను. దాసులకు దాసుఁడను అని నీతోఁ జెప్పికొంటిని. ఇఁక నీదాసుల తప్పుల నెట్లో అట్లే నీదాసులకు దాసుఁడనైన నాతప్పులను దీర్చు దిక్కు నీవేసుమీ.

చ. ఇతఁడుదురాత్ముఁడంచుజను ♦ లెన్నఁగనాఁబడిఁగొంటినేనెపో
పతితుఁడ నంటినో పతిత ♦ పావనమూర్తివి నీవుగల్గ నే
నితరుల వేఁడనంటినిహ ♦ మిచ్చిననిమ్ము పరంబొసంగు మీ
యతులితరామనామమధు ♦ రాక్షరపాళినిరంతరంబు హృ
ద్గతమనినమ్మిగొల్చెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 59

టీ. ఇతఁడు = వీఁడు, దురాత్ముఁడు, అంచున్ = దుష్టమనస్సుగలవాఁడు అనుచు, జనులు = లోకులు, ఎన్నఁగన్ = తలపఁగా, అరడిఁగొంటిన్ = నిందపడితిని, నేనెసుమీ, పతితుఁడను అంటి = పాపాత్ముఁడను అనిచెప్పితిని, ఓరామా, పతిత = పాపాత్ములైనవారిని, పావన = పవిత్రులను చేయునట్టి, మూర్తివిఁ అగు, నీవు; కల్గన్ = గలిగియుండఁగా, నేను, ఇతరులన్ = అన్యులను, వేఁడను అంటిన్ = ప్రార్థింపను అని చెప్పితిని, ఇహము = ఇహలోకసుఖము, ఇచ్చినన్ = ఇచ్చితివని, ఇమ్ము, పరంబు = పరలోక సౌఖ్యమును, ఒసంగుమీ = ఇచ్చినదైన ఇమ్మా, అతులిత = సాటిలేని, రామనామ = "రామ" అనెడి పేరుయొక్క, మధుర = తీయనైన, అక్షర = అక్షరములయొక్క, పాళి = సమూహము, నిరంతరంబు = ఎప్పుడును, హృద్గతము = మనస్సును బొందినది, నామనస్సునందే యుండునది అని, నమ్మిగొల్చెదను = సేవించెదను.

తా. నేను దుష్టమనస్సు గలవాఁడనని జనులచేత నిందపడితిని. నాయంతట నేనే పతితుఁడనని నీతో చెప్పికొంటిని. పతితులను పవిత్రులనుగాఁజేయ నవతరించి నీవుండగా పతితుఁడనైన నేను నిన్నే వేఁడుదును. గాని మఱియొకరిని వేఁడనని యు చెప్పితిని. ఇఁక నీవొకఁడవే నాకుస్వామివి కనుక ఇహమిచ్చినను యియ్యవలయును. పరమిచ్చిన నీవ యీయవలయును. నేనుమాత్రము నా తుదకు "రామ" యనెడి తీయని యక్షరములను మనస్సునందు నిలుపుకొని కొలువు చేసెదను.

ఉ. అంచితమైన నీదుకరు ♦ ణామృతసారము నాదుపై నిబ్రో
క్షించినఁజాలు దాన నిర ♦ సించెద నాదురితంబులెల్లఁదూ
లించెద వైరి వర్గ మెడ ♦ లించెదఁ గోర్కెల నీదుబంటనై
దంచెదఁ గాలకింకరుల ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 60

టీ. అంచితము = ఒప్పునది, ఐన నీదుకరుణా = అయినట్టినీదయ అనెడి, అమృతసారము = అమృతముయొక్క తేట, నాదుపైని=నామీద, ప్రోక్షించినన్ = చల్లినయెడల, చాలున్ = అదియేచాలును, దానన్ = దానిచేత నాదురితంబులు, ఎల్లన్ = నాపాపములను అన్నిటిని, నిరసించెదన్ = తిరస్కరించెదను, వైరివర్గము = శత్రుసమూహమును, తూలించెదన్ = చెదరునట్లుచేసెదను, కోర్కెలన్ = రాగములను, ఎడలించెదన్ = విడిచిపోవునట్లు, చేసెద, నీదుబంటునునై = నీదాసుండనై కాలకింకరులన్ = యమదూతలను, దంచెదన్ = కొట్టితరిమెదను.

తా. రామా! ఒప్పిదమైన నీదయామృతసారమును నామీఁద చల్లిన చాలును. దానిచేతనే నాపాపములను దూలించి, అంతశ్శత్రువులు అయిన యింద్రియములను చిక్కఁబట్టి రాగద్వేషములనువదలి, నీదాసుఁడనై యమకింకరులు వచ్చిరేని కొట్టి తఱిమెదను.

చ. జలనిధులేడునొక్క మొగి ♦ జక్కికిఁ దెచ్చెశరంబు, రాతినిం
పలరఁగఁజేసె నాతిగఁ బ ♦ దాబ్జపరాగము, నీచరిత్రమున్

జలజభవాదినిర్జరులు ♦ సన్నుతి సేయఁగలేరు గావునం
దలఁప నగణ్యమయ్యె నిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 61

టీ. శరంబు=నీబాణము, జలనిధులు, ఏడుక్=ఏడు సముద్రములను, ఒక్కమొగిన్=ఒక్క సారిగా, చక్కికిన్=ఒకచోటికి, తెచ్చె=తెచ్చెను, పదాబ్జ = తామరలవంటి నీయడుగులయొక్క, పరాగము=ధూళి, రాతిన్= రాతిని, ఇంపు = మనోజ్ఞత, అలరంగన్ = ఒప్పునట్లుగా, నాగతిన్ = స్త్రీగాఁ, చేసెను, నీచరిత్రముక్ = నీచరిత్రమును, జలజభవ = బ్రహ్మ, ఆది = మొదలుగాగల, నిర్జరులక్ = దేవతలును, సన్నుతిసేయఁగ=స్తోత్రముచేయఁగా, లేరు, కావునన్ = కనుక, తలఁపన్ = విచారింపఁగా, అగణ్యము = గణుతింపరానిది.

తా. రామా! నీబాణము సప్తసముద్రములను ఒక్కచోటికి తీసికొనివచ్చినది. నీపాదపద్మముల రజస్సు రాతిని స్త్రీగా జేసినది. ఇట్టినీచరిత్రము బ్రహ్మదులకయినను పొగడ శక్యము గాదు. కావున దానిని గణుతింప సాధ్యము కాదు.

ఉ. కోఁతికిశక్యమా యసుర ♦ కోటులఁ గెల్వను గెల్చెఁ బో నిజం
బాతని మేని శీతకరుఁ ♦ డౌట దవానలుఁ డెట్టిదింత! మా
సీతపతివ్రతామహిమ ♦ సేవకుభాగ్యము మీకటాక్షమున్
ధాతకుశక్యమా పొగడ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 62

టీ. అసురకోట్లను=కోట్లకొలఁది రాక్షసులను, గెల్వను = గెలుచుటకు, కోఁతికిన్ ఒకకోఁతికి, శక్యమా = తరమా, గెల్చెన్ పో = గెలుచును గాక, ఆతని మేన్=ఆవానరుని దేహమునందు, దవానలుఁడు=గాలిచిచ్చు, శీతకరుఁడు = చంద్రుఁడు, ఔట = అగుట, ఎట్టిదింత = ఎంతటి యాశ్చర్యము, మా సీత = మాతల్లియైన సీతాదేవియొక్క, పతివ్రతా=పాతివ్రత్యముయొక్క, మహిమ = గొప్పతనమును, సేవకుభాగ్యము = నిన్ను సేవించువానియొక్క భాగ్యవిశేషమును, మీకటాక్షముక్ = మీయొక్క

దయను, పొగడన్ = స్తుతించుటకు, ధాతకున్ = బ్రహ్మదేవునికి, శక్యమా = తరము కాదు.

తా. రామా! ఒకకోఁటి భయంకరులైన రాక్షసులను కోట్లకొలఁదిని గెలుచుట శక్యము కాదు. అదియెట్లో శక్యమైనను కానిమ్ము. కాని, అతని తోఁకయందు అంటించిన నిప్పు వేఁడిమినూపక చల్లనగుట మఱియు నాశ్చర్యము. ఇంతకు సీతయొక్క పాతివ్రత్య ప్రభావమును మీయిరువురిని సేవించిన వాని భాగ్యమును, మీ కరుణా కటాక్షమును కారణము గనుక ఈ మాఁటిని బ్రహ్మదేవునకు పొగడఁదరము కాదు. మనుజులు ఏమని వర్ణింపగలరు!

ఉ. భూపలలామ రామ రఘు ♦ పుంగవరామ త్రిలోక రాజ్య సం
స్థాపన రామ మోక్ష ఫల♦దాయక రామ మదీయపాపముల్
శాపఁగదయ్య రామ నినుఁ ♦ బ్రస్తుతిచేసెదనయ్య రామ సీ
తాపతిరామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 68

టీ. భూపలలామ = రాజులకు శ్రేష్ఠుఁడవైన, రామ = రామా, రఘుపుంగవ = రఘువంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడవైన, రాము = రామా, త్రిలోక = ముల్లోకములయొక్క, రాజ్య = రాజ్యమును, సంస్థాపన = స్థాపించినట్టి, రామా, మోక్ష = మోక్షమనెడి, ఫల = ఫలమును, దాయక = ఇచ్చునట్టి, రామ = రామా, సీతాపతిరామ = సీతకు పెనిమిటియైనరామా, నిన్నుఁ, బ్రస్తుతిచేసెద = స్తుతించెదను, మదీయపాపముల్ = నాపాపములను, రామ = రామా, పాపఁగదయ్య = పోఁగొట్టుమా.

తా. రామా! నీవు రాజులలోనెల్ల శ్రేష్ఠుఁడవు. మఱిరఘువంశమున బుట్టినవారిలో శ్రేష్ఠుఁడవు. కేవలము రాజ శ్రేష్ఠుఁడవే కాదు. ముల్లోకములను కుదురుగా నుండునట్లు ఏలునట్టిదిట్టవు. వానికంటె మిక్కిలి అతిశయ మోక్షఫలమును ఇచ్చువాఁడవు. అన్నిటికిని అతిశయించిన లక్ష్మీస్వరూపము సీతాదేవికి భర్తవు. ఇట్టి మితిలేని అతిశయమునుగలవాఁడవు గావున

గోరినకోర్కు లియ్యనచ్చును. తెలిసినంతవరకు నిన్ను పొగడెదను. ఆ పొగడ్తను బట్టియైనను నాపాపములను పోగొట్టి నన్ను గాపాడుము.

ఉ. నీసహజంబు సాత్త్వికము ♦ నీవిడిపట్టు సుధాపయోధి, ప
ద్మాసనుఁడాత్మజుండు, కమ ♦ లాలయనీప్రియురాలు నీకు సిం
హాసనమిద్ధరిత్రి, గొడు ♦ గాకస మక్షులు చంద్రభాస్కరుల్
నీసుమతల్పమాదిఫణి ♦ నీవె సమస్తముఁ గొల్చునట్టి నీ
దాసులభాగ్యమెట్టిదయ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 64

టీ. సాత్త్వికము = సత్వగుణము, నీసహజంబు = నీకు సహజమైనది, సుధాపయోధి = పాలసముద్రము, నీవిడిపట్టు = నీయొక్క విడిదిచోటు ఆత్మజుఁడు=నీకొడుకు, పద్మాసనుఁడు = బ్రహ్మ, నీప్రియురాలు కమలాలయ = లక్ష్మీదేవి, ఈధరిత్రి = ఈభూమి, నీకు, సింహాసనము, ఆకసము = ఆకాశము, గొడుగు, చంద్రభాస్కరులు = చంద్రుఁడును సూర్యుఁడును, అక్షులు=కన్నులు, ఆదిఫణి = ఆదిశేషుఁడు, నీసుమతల్పము = నీపూవు పాన్పు, సమస్తమును = సర్వపదార్థములును, నీవే=నీవే, ఇట్టి నిన్ను కొల్చునట్టి = సేవించునట్టి, నీదాసుల = నీదాసజనులయొక్క భాగ్యము= పెంపు, సొంపు, ఎట్టిదయ=ఎట్టిదయ్యా.

తా. రామా! సత్వగుణము నీస్వభావము. నీవిడిది పాలసముద్రము. నీకొడుకు బ్రహ్మదేవుఁడు. నీభార్య లక్ష్మి, ఈభూమి నీసింహాసనము, ఆకాశము నీగొడుగు, నీకన్నులు చంద్రసూర్యులు, ఆదిశేషుఁడు నీపూవుపాన్పు అన్నియు నీసొమ్మయగును. సర్వమునకును స్వామివయిన నిన్నుగొల్చిన భక్తుల భాగ్యము ఎట్టిదో చెప్పతరమా. ॥

ఉ. చరణముసోకినట్టి శిల ♦ జవ్వనిరూపగు టొక్కవింత ను
స్థిరముగ నీటిపై గిరులు ♦ దేలినదొక్కటివింతగాని యీ

స్మరణఁదనర్చు మానవులు ♦ సద్గతిఁజెందినదెంతవింత యీ
ధరనుధరాత్మజారమణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 65

టీ. ధరాత్మజా=సీతాదేవికి, రమణ = పురుషుఁడైనవాఁడా, చరణము౯=నీపాదమును, సోఁకినట్టి శిల=తాఁకినట్టిరాయి. జవ్వనియౌటయు=యౌవనముగల స్త్రీయొక్క రూపము అగుట, ఒక్క వింత = ఒకయాశ్చర్యము, నీటిపయి౯=నీటిమీఁద, గిరులు = కొండలు, సుస్థిరముగ౯ = మిక్కిలి నిలుకడఁగా, తేలఁడి = తేలుచుండెడిది, ఒక్కటివింత = మరియొక ఆశ్చర్యము, కాని, మీస్మరణ౯=మిమ్ము స్మరించుటయందు, తనర్చుమానవులు= ఒప్పునట్టి మనుష్యులు, సద్గతి౯ = మోక్షమును, చెందినది = పొందినది; ఈధర౯=ఈభూమియందు, ఎంతవింత=ఎంత ఆశ్చర్యము.

తా. రామా! పాదములకు తాకిన రాతిని స్త్రీగాఁ జేయుటయు, కొండలను నీళ్ళమీఁద మునుఁగకుండునట్లు నిల్పుటయు నాశ్చర్యములు, కాని నిన్ను స్మరించినవారికి నీవు మోక్షము నొసఁగుట ఒకఆశ్చర్యము కానేరదు.

ఉ. దైవము తల్లిదండ్రి తగు ♦ దాతగురుండుసఖుండునిన్నెకా
భావనసేయుచున్న తఱిఁ ♦ బాపములెల్ల మనోవికారదు
ర్భావితుఁజేయుచున్నవి కృ ♦ పామతివై ననుఁ గావుమీజగ
త్పావనమూర్తి భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 66

టీ. జగత్పావనమూర్తి = లోకములను పవిత్రముచేయు రూపముగల వాఁడా, దైవము, తల్లి, దండ్రి, తగుదాత=తగునట్టిదాత, గురుండు=గురువు, సఖుండు=స్నేహితుఁడు, నిన్నె=నీవె, కా౯=అగునట్లు, భావనసేయుచున్న తఱి౯=భావించుచున్న సమయమందు, పాపములు ఎల్ల౯=పాపములన్నియును, మనః = మనస్సుయొక్క, వికార = వికారముచేత, దుర్భావితు౯ = చెడ్డస్వభావము కలవానినిగా, చేయుచున్నవి. కృపామతి. యి = దయగల మనస్సుగలవాఁడవై, నన్ను౯=కావుమీ రక్షింపుమీ,

తా. రామా! నేను నిన్ను దైవముగాను, తల్లిదండ్రులుగాను, గురువుగాను, స్నేహితుఁడుగాను భావించుచుండఁగా నాపూర్వపాపము లన్నియు జేరి నామనస్సును కలఁచి దుష్టభావమును కల్పించి చెరుపుచున్నవి. లోకుల పాపములను బోఁగొట్ట నవతరించినవాఁడవు. కనుక నాపాపములను బోనణఁచి నన్ను కాపాడుమా.

ఉ. వాసవరాజ్యభోగ్యసుఖ ♦ వార్ధిని దేలు ప్రభుత్వమబ్బి నా
యాసకు మేరలేదు కన ♦ కాద్రిసమానధనంబుఁగూర్చినం
గాసును వెంటరాదు కని ♦ కానక చేసిన పుణ్యపాపముల్
వీసరబోవ నీవు పది ♦ వేలకుఁ జాలు భవంబు నొల్ల నీ
దాసునిఁగాఁగ నేలికొను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 67

టీ. వాసవ=ఇంద్రునియొక్క, రాజ్య = దొరతనమును, భోగ = అనుభవించుటవలని, సుఖ = సౌఖ్యము అనెడి, వార్ధిని = సముద్రమునందు, తేలు ప్రభుత్వము = తేలునట్టి దొరతనము, అబ్బినా = లభించినప్పటికిని, ఆసకున్ మేరలేదు = మితిలేదు, కనకాద్రి = బంగారుకొండతోడ, సమాన=సమానమయిన, ధనంబున్ = ద్రవ్యమును, కూర్చినన్=పేరించినను, కాసును=కాసుకూడ, వెంటరాదు=వెంబడిరాదు, కని=తెలిసియు, కానక = తెలియకయు, చేసిన=చేసినట్టి, పుణ్యపాపముల్, వీసరపోవ నీవు=వెలితిపడనియ్యవు, పదివేలకున్ = పదివేల అనర్థములకును, చాలున్= అవిచాలియుండును, భవంబున్=పుట్టుకను, ఒల్లన్=ఇష్టపడను, నీదాసుని గాఁగన్ = నీ సేవకునిగా, ఏలుకొని రక్షింపుము.

తా. రామా! ఇంద్రభోగమును, ఇంద్రునియైశ్వర్యమును కలిగినను, ఆశకు మితిలేదు. బంగారుకొండంత ధనము కూర్చి పెట్టినను, పోవునపుడు ఒక కాసు కూడ వెంటరాదు. తెలిసియో తెలియకయో చేసిన పాపపుణ్యములు చుట్టుకు ఆవరించుకొని కొంచెమయినను తప్పించుకొనుటకు అవకాశమీయవు. మఱికొన్ని యనర్థములయినను కలిగింపఁజాలును. కనుక

పుణ్యపాపములుచేసి జన్మము లెత్తుటకు నాకు ఇష్టములేదు. నీ దాసునిగా చేపట్టి జన్మములేకుండఁగా పోఁడుమా,

ఉ. సూరిజనుల్ దయాపరులు ♦ సూనృతవాదులలుబ్ధమానవుల్
వీరపతివ్రతాంగనలు ♦ విప్రులు గోవులు వేదముల్ మహీ
భారముఁదాల్పఁగా జనులు ♦ పావనమైన పరోపకార స
త్కార మెఱుంగలేరకట ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 68

టీ. సూరిజనుల్ = పండిత సమూహమును, దయాపరులు=దయగల వారును, సూనృతవాదులు=సత్యముపలుకువారును, అలుబ్ధమానవుల్=లోభము లేని మనుష్యులును, వీరపతివ్రతాంగనలు = వీరత్వముతో పతివ్రతలై యుండు స్త్రీలును, విప్రులు=బ్రాహ్మణులు, గోవులు. వేదములు; మహీ భారము=భూమియొక్క బరువును, దాల్పగాన్ = ధరింపఁగా, జనులు = సామాన్యులయిన తక్కినజనులు, పావనము=పవిత్రము, ఐనపరోపకార= ఐనట్టిపరోపకారమునకు, సత్కారమునకు=సత్కరించుట, ఎఱుంగలేరు = తెలియలేరు, వారికి ప్రతిసత్కారము సేయనేరకున్నారనుట, అకట = అయ్యో!

తా. రామా! పండితులు, దయాళురు, సత్యసంధులు, లోభములేని వారు, మిక్కిలి వీరపతివ్రతలయిన స్త్రీలు, బ్రాహ్మణులు, గోవులు వేదములు ఈ భూజనులను ఉద్ధరించుచున్నవి. ఇట్టి ఉపకారములకు తక్కిన జనులు ప్రత్యుపకారముచేసి పూజించుట ధర్మము, అయినను అది జనులు తెలియకున్నారు

ఉ. వారిచరావతారమున ♦ వారిధిలోఁ జొరఁబాఱి క్రోధవి
స్తారగుఁడైన యానిగమ ♦ తస్కర వీరనిశాచరేంద్రునిం
జేరి వధించి వేదముల ♦ చిక్కెడలించి విరించికిమ్మహో
దారత నిచ్చితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 69

టీ. వారిచర+అవతారమునన్ = మత్స్యమైన అవతారమందు, వారిధిలోన్ = సముద్రములోనికి, చొరబాటి= వేగముగా చొచ్చి, క్రోధ= విస్తార = మిక్కిలియైన కోపమును, పొంది, నిగమ = వేదములయొక్క తస్కర = దొంగిలించినవాడైన, వీర = వీరుడగు, నిశాచర+ఇంద్రునిన్ = రాక్షసేశ్వరుడైన, సోమకాసురుని, చేరి = పొంది, వధించి = చంపి, వేదముల చిక్కు = వేదముల గజిబిజిని, ఎడలించి = తీసి, విరించికిన్=బ్రహ్మకు, మహా ఉదారతన్=మిక్కిలి దాతృత్వముతో, ఈవె = నీవే, ఇచ్చితికద= ఇచ్చినవాడవు గదా.

తా. రామా! మత్స్యావతారమునందు సముద్రములోపల వేగముగా చొచ్చి మిక్కిలి కోపాతిశయము గలిగినవాడై వేదములను దొంగిలిపోయిన వీరుడైన మేటిరాక్షసుడగు సోమకాసురుని పట్టి చంపి, వేదములచిక్కు విడఁదీసి బ్రహ్మకు మరల వానిని మిక్కిలి యౌదార్యముతో నిచ్చినవాఁడవు నీవే కాని మఱెవ్వరును గారు, అట్టి నీవు నన్ను గాపాడదగును.

చ. కరమనురక్తి మందరము ♦ కవ్వముగా యహిరాజు త్రాడుగా
దొరకొని దేవదానవులు ♦ దుగ్ధపయోధిమథించుచున్నచో
ధరణి చలింప లోకములు ♦ తల్లడమందఁగఁ గూర్మమై ధరా
ధరము ధరించితీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 70

టీ. కరము=మిక్కిలి, అనురక్తిన్ = అనురాగముతో, దేవ=దేవతలును, దానవులు=రాక్షసులు, మందరము = మందరపర్వతమును, కవ్వముగాన్, అహిరాజు = సర్పములకు రాజయినవానిని, త్రాడుగా, దొరకొని = పూని, దుగ్ధపయోధిన్=పాలసముద్రమును, మథించుచున్నచో = చిలుకుచుండఁగా, ధరణి = భూమి, చలింపన్ = వడఁకఁగా, లోకములు= జగములు, తల్లడమందఁగన్ = తల్లడిల్లఁగా, కూర్మమై = తాఁబేలు

అయి, ధరాధరమున్ = అమందరపర్వతమును, ఈవె = నీవె ధరించితివి కద = ఎత్తితివి కదా.

తా. రామా ! దేవతలును, రాక్షసులును మందర పర్వతమును కవ్వము గాను, సర్పరాజగు వాసుకిని కవ్వపుఁద్రాడుగాను చేసి పాలసముద్రము చిలుకుచుండఁగా నపుడా కొండ తటాలున మునుగుటచేత భూమి, లోకములు తల్లడిల్లుటఁజూచి కూర్మావతారము నెత్తి కొండను వీపుమీఁదఁ దాల్చినవాఁడవు నీవే కదా.

ఉ. ధారుణిఁ జాపజుట్టిన వి ♦ ధంబునఁ గైకొని హేమనేత్రుఁడ
వ్వారిధిలోన డాఁగినను ♦ వాని వధించి వరాహమూర్తివై
ధారుణిఁ దొంటికైవడిని ♦ దక్షిణశృంగమునన్ ధరించి వి
స్తార మొనర్చితీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 71

టీ. ధారుణిన్ = భూమిని, చాపన్ = చాపను, చుట్టినవిధంబునన్=మడిచినతీరుగా, హేమనేత్రుఁడు = హిరణ్యాక్షుఁడు, కైకొని = చుట్టి, ఎత్తుకొని, అవ్వారిధిలోనన్ = ప్రసిద్ధమయిన సముద్రమునందు, డాఁగినను = దాచుకొనఁగా, వానిన్ = ఆహిరణ్యాక్షుని, వధించి = చంపి, వరాహమూర్తివై=పందియాకారము గలవాఁడవై (హిరణ్యాక్షుఁడు చెట్టి కొంపోయిన) భూమిని, దక్షిణశృంగమునన్ = కుడికొమ్మునందు కుడిపంటి కోరయందు ధరించి = తాల్చి, విస్తారము = మఱలచాఁపగా ఈవె = నీవు, ఒనర్చితివి కద = చేసితివి కదా ; చేసినవాఁడవు నీవే.

తా. దశరథరామా ! హిరణ్యాక్షుఁడు భూమిని చాపచుట్టగాచుట్టి యెత్తుకొని సముద్రములోనికి బోయి దాచుకొనఁగా నీవు వానిని జంపి వరాహమూర్తివై కుడిపంటికోరతో భూమిని ఎత్తుకొని వచ్చి మునుపటివలె సాపుగా పఱపు నొందియుండునట్లు చేసినవాఁడవు నీవె కాని మఱియెవ్వరును గారు, కనుక నన్నును అట్లనే ఉద్ధరింపుమా.

ఉ. పెటపెట నుక్కుకంబమున ♦ భీకరదంత నఖాంకురప్రభా
పటలము గప్ప నుప్పతిలి ♦ భండనవీధి నృసింహభీకర
స్ఫుటపటుశక్తి హేమకశి ♦ పుఁ విదళించి సురారిపట్టినం
తటఁ గృపఁజూచితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 72

టీ. ఉక్కుకంబమునన్=ఇనుపస్తంభమునందు, పెటపెట=పెటపెట
మని శబ్దించునట్లు, భీకర=భయంకరమైన, దంత=పండ్లయొక్కయు నఖ+
అంకుర =. గోటిమొనలయొక్కయు. పటలము = సమూహము, వీధిన్,
కప్పన్ = కప్పుకొనఁగా ఉప్పతిలి = పుట్టి, భండన = యుద్ధప్రదేశము
నందు, నృసింహ = నరసింహావతారముయొక్క, భీకర = భయంకర
మైనదియు, స్ఫుట=స్పష్టమైనదియు, పటు=పటువైనదియు, అగుశక్తిన్ =
సామర్థ్యముచేత, హేమకశిపున్ = హిరణ్యకశిపుని, విదళించి = చీల్చి,
అంతటన్ పిమ్మట, సురారి పట్టిన్ = (రాక్షసుని కొడుకైన ప్రహ్లాదుని,)
కృపన్ = దయతో, ఈవె = నీవె చూచితివికదా, నృసింహావతారమెత్తి
హిరణ్యకశిపుని చీల్చి, ప్రహ్లాదుని కాపాడిన వాఁడవు నీవే కాని మఱెవ్వ
రును కారు.

తా. రామా! నీవు ఉక్కుస్తంభమున పెటపెటమని నరసింహ
మూర్తివై పుట్టి నీపండ్లయొక్కయు, మొగ్గలవంటి గోళ్ళయొక్కయు,
తెల్లని కాంతులు నిన్ను గప్పుగా భయంకరమైన శక్తిచే హిరణ్యకశిపుని
ఱొమ్ము చీల్చి చంపి పిదప వానికొడుకైన ప్రహ్లాదుని గాపాడినవాఁడవే
కదా! నన్నును అట్లే గాపాడుము.

చ. పదయుగళంబు భూగగన ♦ భాగములన్ వెసనూనివిక్రమ
స్పదమగు నబ్బలీందుఁ ద్రొక్క ♦ పాదమునందలకిందనొత్తి మే
నొదవజగత్త్రయంబుబుసు ♦ హూతునకియ్యవటుండవైన చి
త్పదమలమూర్తి వీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 73

టీ. పదయుగళంబు=పాదములజంటను, భూ=భూమియొక్కయు, గగన=ఆకాశముయొక్కయు, భాగములన్=ప్రదేశములందు, (ఒక కాలు భూమియందును, మఱియొక కాలు ఆకాశమందును) వెసన్ = శీఘ్రముగా, ఊని=నిలిపి, విక్రమ = పరాక్రమమునకు, ఆస్పదము = స్థానము; అగు నబ్బలీంద్రున్ = అయినట్టి ఆ బలిచక్రవర్తిని, ఒకపాదమునన్ = ఒక కాలిచే క్రిందన్=క్రిందుగా, తలన్=తలను, ఒత్తి = అదిమి, మేలు = శ్రేయస్సు, ఒదవన్ = కలుగఁగా, పురుహూతునకున్=ఇంద్రునికి, జగత్త్రయంబునన్= లోకముల మూఁటిని, ఇయ్యన్ = ఇచ్చుటకు, వటుండవు = వడుగవు, ఐన, చిత్=జ్ఞానమును, సత్=ఉనికియు లేక, సత్యమును, అయిన, అమల=నిర్మలమగు, మూర్తివి=విగ్రహముగలవాఁడవు, నీవెకద=నీవేకాదా.

తా. ఒక పాదము భూమియందును, మఱియొకటి ఆకాశమునందును, పెట్టి, యిట్లు రెండుపాదములచే లోకమాక్రమించి, మహాపరాక్రమవంతుడైన బలిచక్రవర్తి తలమీద నొక పాదముపెట్టి పాతాళమునకు అణఁగద్రొక్కి మేలగునట్లు ముల్లోకములను, ఇంద్రునకు ఇచ్చుటకై వటువుగాఁబుట్టిన సచ్చిదానందమూర్తివి నీవె కాని మఱియెవ్వరుగారు. కనుక నన్ను గాపాడుమా.

ఉ. ఇరువదియొక్కమాఱు ధర ♦ ణీశుల నెల్లవధించి తత్కళే
బర రుధిర ప్రవాహమునఁ ♦ బైతృకతర్పణ మొప్పఁ జేసి భూ
సురవరకోటికిన్ ముదము ♦ సొప్పడ భార్గవరామమూర్తివై
ధరణినొసంగితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 74

టీ. ఇరువదియొక్క మారు = ఇరువదియొక్క పర్యాయములు, ధరణీశులన్ = రాజులను, ఎల్లన్ = అందఱిని, వధించి=చంపి, తత్=వారియొక్క, కళేబర=దేహములయొక్క, రుధిర=నెత్తుటియొక్క, ప్రవాహమునన్ = వెల్లువచేత, పైతృకతర్పణము= పితరులకు జలతర్పణము, ఒప్పన్ = తగునట్లు, చేసి, భూసురవరకోటికిన్ = బ్రాహ్మణశ్రేష్ఠుల సమూహమునకు, ముదము = సంతోషము, చొప్పడన్ = కలుగునట్లు, భార్గవరామ,

మూర్తివి ఐ=భార్గవరాముఁడుగా అవతరించినవాఁడవై, ధరణిన్ = భూమిని ఈవె = నీవే, ఒసంగితివికదా=దానము చేసితివికదా !

తా. రామా ! రాజులనందఱిని ఇరువదియొక్క పర్యాయములు చంపి, వారిదేహముల నెత్తుటికాల్వలచేత పితరులకు జలతర్పణమిచ్చి వారియొద్దనుండి జయించిన భూమిని బ్రాహ్మణ సమూహమునకు సంతోషము కలుగునట్లు దానముచేసిన పరశురాముఁడవు నీవే యగుదువు.

చ. దురమునఁ దాటకందునిమి ♦ ధూర్జటివిల్ దునుమాడి సీతనుం
బరిణయమంది తండ్రి పను ♦ పన్ ఘనకాననభూమికేఁగి దు
స్తరపటుచండకాండ కులి ♦ శాహతి రావణకుంభకర్ణ భూ
ధరములఁ గూల్చితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 75

టీ. దురమునన్ = యుద్ధమున, తాటకన్ = తాటకను, దునిమి = చంపి, ధూర్జటివిల్ = శివునివిల్లు, తునుమాడి = విఱిచి, సీతను = సీతాదేవిని, పరిణయము అంది = పెండ్లాడి, తండ్రి, పనుపన్ = అడవికి పంపఁగా, ఘన = గొప్పదైన, కాననభూమికిన్ = అరణ్యప్రదేశమునకు, ఏగి=పోయి, దుస్తర=కడపరానిదియు, పటు=పటుత్వముగలదియు, చండ = తీక్ష్ణమైనదియు, అగు, కాండ = బాణమనెడి, కులిశ = వజ్రముయొక్క, ఆహతిన్ = దెబ్బచేత, రావణకుంభకర్ణ = రావణుఁడు కుంభకర్ణుఁడు అను భూధరములన్ = కొండలను, ఈవె = నీవె, కూల్చితివికద = కూల్చివైచితివికదా.

తా. రామా ! యుద్ధమున తాటకనుచంపి, శివునివిల్లువిఱిచి సీతను పెండ్లాడి, తండ్రిపంపఁగా నడవికిపోయి వజ్రాయుధముచేత కొండలను గూల్చినట్లు వారింపరాని వాఁడి బాణమున రావణకుంభకర్ణులను గూల్చినవాఁడవు నీవె యగుదువు.

చ. అనుపమయాదవాన్వయసు ♦ ధాబ్ధిసుధానిధికృష్ణమూర్తినీ
కసుజుఁడుగా జనించి కుజ ♦ నావళి నెల నడంచి రోహిణీ

తనయుఁడనంగ బాహుబల ♦ దర్పమునన్ బలరామమూర్తివై
తనరిన వేల్పువీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 76

టీ. అనుపమ = సాటిలేని, యాదవ + అన్వయ = యాదవవంశము అనెడి సుధా + అబ్ధి = పాలసముద్రమునకు, సుధానిధి = చంద్రుఁడగు పాలసముద్రమును శోభింపఁజేయు చంద్రునివలె యాదవవంశమును వర్ధిలజేయువాఁడవై, కృష్ణమూర్తి = కృష్ణుఁడు, నీకున్, అనుజుండుగా = తమ్ముఁడు అగునట్లుగా, రోహిణీ తనయుఁడు అనంగన్ - రోహిణీదేవి కుమారుఁడు అని జనులాడఁగా, జనించి = పుట్టి, బాహుబల = భుజముల బలిమిచేతనైన, దర్పమునన్ = గర్వముచేత, ఖజన + అవళిన్ ఎల్లన్ = దుష్టుల సమూహమును అంతయు, అడంచి = అడఁగఁ ద్రొక్కి, బలరామమూర్తివై = బలరామావతార మెత్తినవాఁడవై, తనరిన వేల్పు = ఒప్పునట్టి దేవుఁడవు, ఈవెకదా = నీవేకదా.

తా. రామా! యాదవవంశ తిలకుఁడైన కృష్ణుఁడు తమ్ముఁడుగాఁగలిగి రోహిణీదేవి కడుపునఁబుట్టి, భుజబలాతిశయము చేత దుష్టసమూహములనెల్ల రూపుమాపి బలరాముఁడుగా నవతరించిన దేవుఁడవు నీవే యగుదువు.

చ. సురలునుతింపఁగాఁ ద్రిపుర ♦ సుందరులన్ వరియింపబుద్ధరూ
పరయఁగ దాల్చితీవు త్రిపు ♦ రాసురకోటిదహించునప్పుడా
హరునకుఁదోడుగా వర శ ♦ రానన బాణముఖోగ్రసాధనో
త్కర మొనరించితీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 77

టీ. అరయఁగన్ = విచారింపఁగా, సురలు = దేవతలు, నుతింపఁగాన్ = పొగడఁగా, త్రిపుర సుందరులన్ = త్రిపురములందలి స్త్రీలను, వరియింపన్ = వరియించుటకై, బుద్ధరూపు = బౌద్ధమూర్తిని, ఈవు = నీవు, దాల్చితి = ధరించితివి, త్రిపుర = త్రిపురములలో వసించు, అసురకోటిన్ = రాక్షస సమూహమును, దహించునప్పుడు, ఆహరునకున్ = శివునకు, తోడు

గాన్=సహాయముగా, వర=శ్రేష్ఠమైన, శరాసన=విల్లు, బాణ=బాణము, ముఖ=మొదలయిన, ఉగ్ర=భయంకరమగు, సాధన=పరికరము యొక్క, ఉత్కరము=సమూహము, ఈవె=నీవె, ఒనర్చితివికదా=చేసితివిగావా.

తా. దేవతలు ప్రార్థింపఁగా త్రిపురములందలి స్త్రీలను వరించుటకు బౌద్ధవిగ్రహము దాల్చినవాఁడవు నీవే. ఆత్రిపురరాక్షస సమూహములను గాల్చునప్పుడు శివునికి విల్లు, అమ్ము మొదలయిన సాధనములను సవరించి సాహాయ్యము చేసినవాఁడవు నీవే. ఇట్లు దుష్టులను నిగ్రహించి శిష్టులను రక్షించు నీవే నన్నును రక్షింపుమా.

ఉ. సంకరదుర్గమై దురిత ♦ సంకులమైన జగంబుఁజూచి స
ర్వంకషలీలనుత్తమతు ♦ రంగము నెక్కి కరాసిఁబూని వీ
రాంకవిలాస మొప్పఁగలి ♦ కాకృతి సజ్జనకోటికిన్ నిరా
తంక మొనర్చితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 78

టీ. సంకర=వర్ణసంకరముచేత, దుర్గమై=ప్రవేశింపరానిదై, దురిత=పాపముచేత, సంకులము=వ్యాపించినది, ఐన జగంబు=అయినట్టిలోకమును, చూచి, సర్వంకష=అన్నిటిని ఒరయుచున్న, లీలన్=విలాసముతో, ఉత్తమతురంగము=మేలయినగుఱ్ఱమును, ఎక్కి, కర+అసిన్=చేతికత్తిని, పూని=తాల్చి, వీర+అంక విలాసము=వీరాంక వీరుఁడనుట, పరాక్రమము, ఒప్పన్=ఒప్పుచుండఁగా, కలికి+ఆకృతిన్=కల్కిఆకారముతో (కల్క్యవతారమెత్తి) సజ్జనకోటికిన్=సత్పురుష సమూహమునకుఁ, నిరాతంకము=ఆటంకము లేమి, ఈవె=నీవె, ఒనర్చెదు+కద=చేయుబోయెదవుకదా.

తా. రామా! వర్ణసంకరము మిక్కిలి బలీయమయి పాపము నిండియున్న జగమును జూచి మిక్కిలి లీలతో గొప్ప గుఱ్ఱము నెక్కి చేతఁగత్తి దాల్చి పరాక్రమము విలాసము మెఱయఁగా కల్కిమూర్తివై సజ్జనులకు

దురాచార వర్ణసంకరాది ప్రతిబంధకములు లేకుండునట్లు. ఇక చేయఁగల వాఁడవు నీవె యగుదువు.

చ. మనమున నూహాపోషణలు ♦ మర్వకములెన్నికఫాదిరోగముల్
దనువున నంటి మేనిబిగి ♦ దప్పకమున్నె నరుండు మోక్షసా
ధన మొనరింపఁగావలయుఁ ♦ దత్త్వవిచారము మానియుండుట
ల్తనువునకున్ విరోధమిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 79

టీ. మనమునన్ = మనస్సునందు, ఊహాపోషణలు= ఊహాపోహలు, మర్వకములెన్నె= వారవిపాకములను జే, కఫాదిరోగములో = కఫము మొదలయిన తెవుళ్లు, తనువునన్ = దేహమునందు, అంటి= తగులఁబడికలిగి, మేనిబిగి= దేహముయొక్క పటుత్వము, తప్పకమున్నె, నరుండు=మనుష్యుఁడు, మోక్షసాధనము, మోక్షము= మోక్షమునకు, సాధనము= సాధించు ఉపాయము, ఒనరింపవలయున్ = చేసికొనఁగావలయును, తత్త్వ- వస్తువుల కల రూపును, విచారము = పరిశీలనము, మానియుండుటల్ = వదలి యుండు కార్యములు, తనువునకున్= దేహమునకు, ఇది విరోధము = విరుద్ధమైనది.

తా. రామా! మనస్సునకు ఊహించుశక్తియుఁ దలంచుకొనుశక్తియు నశింపకమునుపును. కఫము మొదలయిన రోగములు దేహమున వ్యాపించి పటుత్వము తప్పకమునుపును, మనుష్యుఁడు తత్త్వవిచారము చేసి మోక్షమునకు దగిన సాధనములను చేసికొనవలయును. పిదప చేసికొనుటకు శక్యము కాదు. తత్త్వవిచారము సేయకుండుట ఆత్మస్వరూపమునకు విరుద్ధమగును.

చ. ముదమునకాటపట్టుభవ ♦ మోహమదద్విరదాంకుశంబుసం
పదలకొటారు కోరికల ♦ పంట పరంబున కాదివేరుల
న్నదన జయించుత్రోవ విప ♦ దబ్ధికి నావగదా సదా భవ
త్పదమలనామసంస్మరణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 80

టీ. భవత్=నీయొక్క, సత్ = శ్రేష్ఠమగు, అమల = నిర్మలమైన నామ = నామముయొక్క, సంస్మరణ = మిక్కిలి స్మరించుట. ముదమునకున్ = సంతోషమునకు, ఆటపట్టు = స్థానము, భవ = పుట్టుకయును, మోహ=అజ్ఞానమనెడి ద్విరద=ఏనుఁగునకు అంకుశంబు=అంకుశము, సంపదలకోటారు=సంపత్తు చేర్చియుండెడి కొట్టు, కోర్కుల నెల్లసఫలముగాఁ జేయునదనుట. పరంబునకున్=పరలోకమునకు, అచ్చ= మొదలు, వైరులన్= శత్రువులను, అదనన్=సమయమునుజూచి, జయించుత్రోవ=గెలుచుమార్గము, విపత్ + అబ్ధికిన్=ఆపదయనెడి సముద్రమునకు, నావ = ఓడ, (సముద్రమునుదాఁటించు ఓడవలె ఆపదలను పోఁగొట్టుననుట) కదా=అగును.

తా. రామా! నిర్మలమైన నీనామమును స్మరించుట సంతోషము కలిగించును. అంకుశముచే ఏనుఁగును అణఁచునట్లు ఎడతెగకయుండు జన్మపరంపరను అణచును. సకలసంపదలను ఇచ్చును, కోరికలనెల్ల సఫలము గావించును. సర్వలోకములకు మూలము. పగవారిని గెలుచుటకు సాధనమైనది. సముద్రమును దాటించు యోడవలె ఆపదలను పోఁగొట్టును.

చ. దురితలతానుసారి భవ ♦ దుఃఖకదంబము రామనామ భీ
కరతరహేతిచేఁ దెగి వ ♦ కావకలై చనకుండ నేర్చునే
దరికొనిమండుచుండు శిఖిఁ ♦ దార్కొనినన్ శలభాదికీటకో
త్కరము విలీనమై చనదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 81

టీ. దురిత=పాపమనెడి, లత = తీఁగను, అనుసారి = అనుసరించుచున్న, భవ = పుట్టుకలనెడి, దుఃఖకదంబము = దుఃఖసమూహము, రామనామ=రామనామము అనెడి, భీకరతర=మిక్కిలి భయంకరమైన, హేతి చేన్ = కత్తిచేత, తెగి, వకావకలై = భిన్నాభిన్నమై, చనకుండ నేర్చునే= పోవకుండఁజాలునా, దరికొని=తగులుకొని, మండుచుండు శిఖిన్=జ్వలించుచున్న అగ్నిని, దార్కొనినన్ = మీఁదపడఁగా, శలభ = మిడుతలు,

ఆది = మొదలైన, కీటక = పురుగుల, ఉత్కరము = సమూహము, విలీనమై = మిక్కిలి అడఁగిపోయినదై, చనదె = పోదా, నశించియే పోవునని భావము.

తా. రామా! పాపము పయిపయిరాఁగా దానితోఁగూడ, సాఁగు దుఃఖాత్మకమయిన జన్మపరంపర, కత్తిచేత తీఁగ త్రెంపఁబడునట్లు, నీరామనామముచే నశించి పటాపంచలై, ఎగిలి మండుచున్న అగ్ని బడిన మిడుతలు మొదలైన పురుగులవలె రూపుమాసిపోవును.

చ. హరిపదభక్తినింద్రియజ ♦ యాన్వితుఁడుత్తముఁడింద్రియంబులన్
మరుగకనిల్పనోఁదినను ♦ మధ్యముఁ డింద్రియపారవశ్యుఁడై,
పరగినచోనికృష్టుఁడని ♦ పల్కఁగఁ దుర్మతినైన నన్ను నా
దరమున నెట్లుకాచెదవొ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 52

టీ. హరిపదభక్తి = విష్ణువు పాదములందలి భక్తిచేత; ఇంద్రియ = ఇంద్రియములను, జయ = గెలుచుటతోడ, అన్వితుఁడు = కూడినవాఁడు, ఉత్తముఁడు = శ్రేష్ఠుఁడు, ఇంద్రియంబులన్ = ఇంద్రియములను, మరుగక = లీనుఁడు గాక, (ఇంద్రియము పోయినదానిపోక) నిల్పన్ = దానిని నిగ్రహింపను, ఓదినను = ప్రయత్నించిన యెడల, మధ్యముఁడు = నడిమిరకపు వాఁడు, ఇంద్రియ = ఇంద్రియములకు, పారవశ్యుఁడై = అధీనుఁడైన, పరగినచోన్ = ప్రవర్తించిన యెడల, నికృష్టుడు = అధముఁడు, అని పల్కగన్ = చెప్పఁగా, దుర్మతిని = దుష్టబుద్ధిని, ఇంద్రియములకు లోనైనవాఁడను, ఆదరమునన్ = ఆదరింపుతో, ఎట్లు కాపాడెదవో.

తా. దశరథరామా! విష్ణుపదభక్తితో ఇంద్రియములను గెలిచినవాఁడు ఉత్తముఁడు. ఇంద్రియములకు లోనుగాక నిగ్రహింప ప్రయత్నించువాఁడు మధ్యముఁడు. ఇంద్రియములకు అధీనుఁడైనవాఁడు అధముఁడు. ఈ మువ్వురలో దుష్టబుద్ధినైన నేను అధముఁడను గనుక రక్షింపఁ దగినవాఁడను కాను. అయినను నన్నెట్లు రక్షించెదవో తెలియదు.

చ. వనకరి చిక్కె మైనసకు ♦ వాచవికిం జెడిపోయె మీను తా
వినికికిఁ జిక్కెఁ జిల్వ కను ♦ వేఁదురుఁ జెందెను లేళ్ళు తావిలో
మనికి నశించె దేఁటి తర ♦ మా యిరుమూఁటిని గెల్వ నైదుసా
ధనములనీవె కావఁదగు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 83

టీ. వనకరి=అడవియేనుఁగు, మైనసకున్ = దేహమునందలి చాపల్యమునకు, (ఏనుఁగును పట్టుకొన్నవాండ్రు ఆకర్షించుటకై విడుచు ఆఁడ ఏనుఁగు దేహమును జూచి కామించియనుట,) చిక్కెన్ = చిక్కుపడెను, మీను=చేఁప. వాచవికిన్ = నోటికి చికి (గాలమునందు గ్రుచ్చిన యెఱ్ఱ యందలి రుచికి) చెడిపోయెన్=తగులుపడి చెడెను. చిల్వ=పాము, తాన్ = తాను, వినికికిన్ = వినుటకు (పాములవాఁడు ఊఁదు స్వరమును వినుటకు) చిక్కె=చిక్కుపడె, లేళ్ళు, కనువేదురున్=కంటిపిచ్చి, చెందును= పొందును (చక్షురింద్రియములకు లోనయ్యె) తేఁటి=తుమ్మెద, తావిలో= వాసనలో, మనికిన్ = ఉండుటచేత, నశించెను. (ఘ్రాణేంద్రియమునకు లోనై పూఁదేనె వాసనకై తామరపూవులో చొచ్చి అది ముడుచుకొనఁగా లోపలచిక్కుకొనెనుట) ఇరుమూటిని=ఐదింటిని (ఐదుయింద్రియములను) గెల్వన్ = జయించుటకు, తరమా = శక్యమా, ఐదుసాధనములన్ = పంచవిధములైన ఉపాయములచేత నీవె కావఁదగున్ = నీవే కాపాడవలయును.

తా. దాశరథీ! అడవిలో ఏనుగు ఆఁడు ఏనుగును జూచియు, చేప గాలమునందలి యెఱచవికిని, పాము పాములవాని ఊదుస్వరమునువినుటకును, లేడి కనుపిచ్చిచేతను, తుమ్మెద తామరలోని పూదేనెవాసనకును లోనయ్యు చిక్కుకొనుచున్నవి. అయిదు ఇంద్రియములను గెలువ నెవరి తరము! కనుక ఇంద్రియలోలుఁడైన నాకు మోక్షము కలుగుట కష్టము గావున పంచేంద్రియముల నిన్నుగొల్చు పంచవిధ కైంకర్యములచేత యింద్రియముల నడఁచి నన్ను కాపాడుము.

చ. కరములు మీకు మ్రొక్కులిడ ♦ కన్నులు మిమ్మునె చూడ జిహ్వ
మీ స్మరణఁ దనర్ప వీనులు భ ♦ వత్కథలన్ వినుచుండ నాస మీ
యురుతను బెట్టుపూసరుల ♦ కాసఁగొనంగ బరమార్థసాధనో
త్కరమిది చేయవే కృపను ♦ దాశరథీ కరుణాపయోనిధీ 84

టీ. కరములు = చేతులు, మీకున్, మ్రొక్కులిడన్ = దండములు పెట్టఁగాను, కన్నులు, మిమ్మునె, చూడన్ = చూడఁగాను, జిహ్వ = నాలుక మీ స్మరణన్ = మిమ్ము స్మరించుటచేత, తనర్పన్ = ఒప్పఁగాను, వీనులు = చెవులు, భవత్కథల్ = మీదైన చరిత్రములను, వినుచుండన్ = వినుచుండగాను, నాస = ముక్కు, మీ యురుతను = మీ మూఁపునందు, పెట్టుపూసరుల కున్ = పెట్టుపట్టిప్రాదండలకు ఆసగొనన్ = ఆసపడఁగాను, అది = అట్లు, ఆయా అవయవములు మీకు ఆయా కార్యములు సేయుట, పరమార్థ = సరియైన, సాధన = పురుషార్థములను సాధించెడి యుపాయము యొక్క, ఉత్కరము = సమూహము (ఐదు అవయవములకు చెప్పిన అయిదు వ్యాపారములే పురుషార్థములను సాధించుటకు ఉపాయము).

తా. చేతులు మీకు మ్రొక్కుటయు, కన్నులు మిమ్ము చూచుటయు, నాలుక మీ నామమును జపించుటయు, చెవులు మీకథలను వినుటయు, ముక్కు మీ మూఁపునందలి ప్రసాదమాలను కోరుటయు ననెడి యీ యైదు వ్యాపారములే మోక్షమునకు సిద్ధికరమైన సాధనములు.

చ. చిరతరభక్తి నొక్కతుల ♦ సీదళ మర్పణసేయు వాఁడు ఖే
చరగరుడోరగప్రముఖ ♦ సంఘములో వెలుఁగన్ సదా భవత్
స్ఫురదరవింద పాదములఁ ♦ బూజలొనర్చిన వారికెల్లఁ ద
త్పరమరచేతిధాత్రి గదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 85

టీ. చిరతరభక్తిన్ = బహుకాలముగానున్న భక్తితో, ఒక్క తులసీ దళము = ఒక్క తులసియాకు, అర్పణసేయువాఁడు = సమర్పించువాఁడు, ఖేచ

రులు=గరుడులు, ఉరగులు అన వీరియొక్క సమూహము లోపల, వెలుఁగన్= ప్రకాశించు, సదా=ఎప్పుడును, భవత్=నీయొక్క, స్ఫురత్ = ప్రకాశించుచున్న, అరవింద = తామరలవంటి, పాదముఁ = అడుగులను, పూజలు ఒనర్చినవారికెల్ల = పూజించినవారికందరికిని, తత్పరము = మోక్షము, అరచేతిధాత్రి = అరచేతి యుసిరికవలె, కదా = అగును.

తా. రామా ! బహుకాలము భక్తితోడ బహుతులసీదళములు నీకు సమర్పించినవాఁడు ఖేచరులు గరుడులు ఉరగలు అను వీరిలో శ్రేష్ఠుఁడై ప్రకాశించును. ఇఁక ఎప్పుడును నీపాదారవిందములను బూజ సేయువారి కందఱికి మోక్షము కరతలామలకమే కదా!

ఉ. భానుఁడు తూర్పునందుగను ♦ పట్టినఁ బావకచంద్రతేజముల్
హీనతఁ జెందునట్లు జగ ♦ దేకవిరాజితమైన నీపద
ధ్యానము సేయుచున్నఁబర ♦ దైవమరీచు లడంగకుండునే
దానవ గర్వనిర్దళన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 86

టీ. దానవ = రాక్షసులయొక్క, గర్వ = గర్వమును, నిర్దళన = హరించువాఁడా, భానుఁడు = సూర్యుఁడు, తూర్పునందుఁ = తూర్పు దిక్కునందు, కనుపట్టినఁ = కనఁబడఁగా, పావక = అగ్నియొక్కయు, చంద్ర = చంద్రునియొక్కయు, తేజముల్ = కాంతులు, హీనతఁ జెందునట్లు, జగదేక = లోకమునకు ముఖ్యముగా, విరాజితము = ప్రకాశించునది ఐన నీపదధ్యానము = అయినట్టి నీపదములను ధ్యానించుట, చేయుచున్నన్ = చేయుచుండఁగా, పరదైవమరీచులు = ఇతరదైవముల కాంతులు, అడఁగకుండునే = అణఁగిపోకుండునా!

తా. సూర్యుని కాంతికి అగ్ని మొదలగువాని కాంతులడఁగునట్లు జగత్తంతయు ప్రకాశించుచున్న నీపదధ్యానముయొక్క ప్రకాశమునకు ఇతర దేవతల ప్రకాశములు అడఁగిపోవును.

ఉ. నీమహనీయతత్త్వరస ♦ నిర్ణయబోధ కథామృతాబ్ధిలోఁ
దా మునుఁగంగలాడక వృ ♦ థాతనుకష్టముఁజెంది మానవుం
డీ మహిలోఁ దీర్థముల ♦ నెల్ల మునింగిన దుర్వికార హృ
త్తామసపంకముల్ విడునె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 87

టీ. నీ మహనీయ = గొప్పదైన, తత్త్వరస = తత్త్వసారముయొక్క, నిర్ణయ = నిశ్చయముగల సిద్ధాంతము గలిగినట్టి, బోధ = జ్ఞానము గలిగిన, కథా = కథలనెడి అమృతాబ్ధిలోన్ = అమృతమయమైన సముద్రమునందు, తాన్ = తాను, మునుఁగన్ = మునిఁగి స్నానము, కలుగఁగ = ? , వృథా = వ్యర్థముగా, తనుకష్టమున్ = శరీరకష్టమును, చెంది = పొంది, మానవుండు = మనుష్యుఁడు, ఈమహిలోన = ఈ భూమియందు, తీర్థములన్ + ఎల్లన్ = తీర్థములందంతటను, మునింగినన్ = మునిఁగినను, దుర్వికార = చెడ్డవికారములుగల, హృత్ = హృదయముయొక్క, తామస = తమోగుణ సంబంధమయిన కార్యమనెడి, పంకముల్ = రొంపులు, విడునె = విడిచిపోవునా.

తా. రామా! నీమహత్త్వముయొక్క సారస్యమిట్టిదని నిర్ణయించి తెల్పు నీదివ్యచరిత్రమనెడి యమృతసముద్రమందు మునుఁగుటచేతనే దుర్వికారమైన హృదయమందలి తామసములనెడి రొంపులు తీసిపోవును గాని కేవలము భూలోకమందలి తీర్థములందు మునిఁగినయెడల అవి తీసిపోవు.

ఉ. కాంచనవస్తుసంకలితక ♦ ల్మషమగ్నిపుటంబుబెట్టి వా
రించినరీతి నాత్మ నిగి ♦ డించిన దుష్కరదుర్మలత్రయం
బంచితభక్తియోగదహ ♦ నార్చిఁ దగుల్పక పాయునే కన
త్కాంచన కుండలాభరణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 88

టీ. కనత్ = ప్రకాశించుచున్న, కాంచన = బంగారుమయమైన, కుండల = కుండలములు, ఆభరణ = సొమ్ములుగలవాఁడా, కాంచనవస్తు =

బంగారుపదార్థమునందు. సంకలిత = మిక్కిలి, తగిలిన కల్మష = మాలిన్యము, అగ్నిపుటంబుపెట్టి = అగ్నిపుటము వేసి, వారించిన రీతిన్ = తొలగించినవిధమున, దుస్తర = చేయరాని, దుర్మలత్రయంబు = చెడ్డవియైన మూడుమలములను (మనోవాక్కాయముల మూటియొక్క మాలిన్యములను) అంచిత = ఒప్పుచున్న, భక్తియోగమనెడి, దహన = అగ్నియొక్క, అర్చిన్ = జ్వాలయందు, తగుల్పక, పాయునే = విడిచిపోవునా ?

తా. రామా ! బంగారులోని మాలిన్యము అగ్నిపుటమువలన పోవునట్లు ఆత్మయందుగల మూడుమలములు నీయందలి భక్తియోగముచేతనే నశించును గాని మఱొక విధమున నశింపవు.

ఉ. నీసతి పెక్కుకల్మిలిడ ♦ నేర్పరి, లోక మకల్మషంబుగా
నీసుత సేయు పావనము, ♦ నిర్మితకార్యధురీణదక్షుడై
నీసుతుడిచ్చు నాయువులు ♦ నిన్ను భజించినంగల్గకుండునే
దాసుల కీప్సితార్థములు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 89

టీ. నీసతి = నీభార్య, పెక్కుకల్ములు = అనేక సంపదలు, ఇడన్ = ఇచ్చుటకు, నేర్పరి = నిపుణురాలు, నీసుత = (నీపాదములందు బుట్టుటచే) నీకూతురైన గంగ, లోకము = జగము, అకల్మషంబుగా = నిర్దోషముగునట్లుగా, పావనముసేయున్ = పవిత్రముగా జేయును. నీసుతుడు = నీకొడుకైయున బ్రహ్మ, నిర్మితకార్య = నిర్మాణకార్యముయొక్క (సృష్టి కార్యముయొక్క) ధురీణ = భారముకల, దక్షుడై = నేర్పరియై, ఆయువులు = ఆయుష్యములు, ఇచ్చును, నిన్నున్ = ఇట్టి (భార్యను, కూతురును, కొడుకులునుగల) నిన్ను, భజించినన్ = కొలువగా, దాసులకున్ = నీ భక్తులకు ఈప్సిత = కోరికలు, గలుగకుండునే = లభింపక పోవునా.

తా. రామా ! నీభార్యయైన లక్ష్మి సమస్త సంపదల నిచ్చుటకు నిపుణురాలు, నీకూతురైన గంగ ముల్లోకముల యందును ప్రవహించి,

చక్కగా తెలియుచుండి ను, ఆయువు నశించునని తెలిసియు అస్థిరములైన యీదేహములయందే అజ్ఞానముయొక్క పాశములచే కట్టుబడుచున్నారే? ఇట్టివారికి కలుగగల స్థితియేమి యని భావము.

చ సిరిగలనాఁడు మైమఱచి ♦ చిక్కిననాఁడు దలంచిపుణ్యముల్
పొరిఁ బొరిఁ జేయనైతినని ♦ పొక్కిన గల్గునె గాలిచిచ్చుపైఁ
గెరలిన వేళఁ దప్పికొని ♦ కీడ్పడు వేళ జలంబుఁగోరి త
త్తరమునఁ ద్రవ్వినం గలదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 93

టీ. సిరి = సంపద, కలనాడు = కలిగియుండిన దినములందును మైమఱచి = దేహము తెలియుట తప్పి. చిక్కిననాఁడుఁ = పున్న దినము లందును. తలంచి=ఆలోచించి, పుణ్యముల్ = పుణ్యకార్యములను, పొరిఁ పొరిఁ = మాటిమాటికి, చేయనైతిని అని = చేయకపోతిని అని, పొక్కినఁ = తపించఁగా, కల్గునె = ఫలముగలుగునా? (ఇందులకుదృష్టాంతరము) గాలి. చిచ్చుపై= అగ్నిమీఁద, కెరలిన వేళఁ=విజృంభించినప్పుడు, (ఇల్లు మొదలగు వానిని కాల్చబూనిన అగ్నిని పుట్టినప్పుడే చల్లార్చక దానిపై గాలి తగిలి మిక్కిలి రగులుకొన్న సమయమున) దప్పికొని, కీడ్పడు వేళఁ=ముక్కుడు సమయమందును. జలంబున్=నీటిని, కోరి = ఆశించి, తత్తరమున = తడఁబాటుతో. త్రవ్వినఁ = భూమినిత్రవ్వఁగా, కలదె = నీరుకలుగునా? (అట్లే సంపదలుండిన కాలమున పుణ్యములు సేయక అది పోయిన వెనుక చేయకపోతిమే యని చింతించుటచే ఫలము లేదనుట.)

తా. సంపద యుండిన కాలమందును, సంపదచే మత్తిల్లి ఒడలు మఱచి యుండిన కాలమందును, ఆలోచించి పుణ్యకార్యములు మాటిమాటికి చేయకపోతినే యని దారిద్ర్యము వచ్చిన వెనుక చింతించుట గాలిచే మిక్కిలి రేగిన నిప్పును ఆర్పుటకును, బాగా దప్పిగొనినప్పుడు, జలమునకై భూమిని వేగిరపడి త్రవ్వుట యెట్లో అట్లే వ్యర్థమగును.

ఉ. జీవనమింకఁ బంకమున ♦ జిక్కినమీను చలింపకెంతయున్
దావున నిల్చి జీవనమె ♦ దద్దయుఁ గోరువిధంబు చొప్పడం
దావలమైనఁగాని గుఱి ♦ దప్పనివాఁడు తరించువాఁడయా
తావక భక్తియోగమున ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 94

టీ. జీవనము = నీళ్లు, ఇంకన్ = ఇంకిపోఁగా, పంకమునన్ = బురదయందు, చిక్కినమీను = చిక్కుపడినచేఁప, ఎంతయున్ = ఎంత మాత్రమును, చలింపక = కదలక, తావునన్ = తానున్నచోటనే, నిల్చి = వుండి, జీవనమె = నీటినేలేక బ్రతుకునే, దద్దయున్ = మిక్కిలి, కోరువిధంబు = కోరునట్టిరీతి, చొప్పడన్ = కలుగునట్లుగా, తావలమైనదానిన్ = స్థానమైన దానిని, తనకు ఆధారమైన దానిని, (తనకు వృజీవకమైన నిన్ను అనుట) గుఱిదప్పనివాఁడు = మాటితప్పనివాఁడు, (తనకు ఆధారభూతుఁడైన నీయందే గుఱియుంచి ఆ గుఱిని తప్పక నిన్నే ధ్యానించుచుండువాఁడు) తావక భక్తియోగమునన్ = నీదైవభక్తితోడి కూడికచే, తరించువాఁడయా = సంసారమును దాటువాఁడు అయ్యా.

తా. చేఁప నీళ్లు యెండిపోయిన బురదలో చిక్కుకొన్నను, ఆచోటును విడిచి కదలక అంకే నిలిచి నీళ్లనే తుదకు గోరునట్లు, నీయందలి చింతనమునందే గుఱియుంచి యెన్ని కష్టములు వచ్చినను దానిని వదలక యుండువాఁడు, ఎల్లందులచే నీయెడల భక్తి యుదయించి ఆ భక్తియోగమున సంసారమును దాటునని తాత్పర్యము.

చ. పరసువిరాజసంబు సుర ♦ సజ్జనుఁడెఱుఁగును ముష్కరాధముం
డెఱిఁగి గ్రహించునా ఱెడె కొల ♦ నేకనివాసముగాఁగ దర్దురం
బెఱుఁగ నేర్చునట్లు వికచా ♦ బ్జమరందరసైక సౌరభో
త్కరముమిళిందమొందుక్రియ ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

ఉ. ఎంతటిపుణ్యమో శబరి ♦ యెంగిలిఁగొంటివి వింతగాదె నీ
మంతన మెట్టిదో యుడుత ♦ మైని కరాగ్రనఖాంకురంబులన్
సంతసమందఁ జేసితివి ♦ సత్కులజన్మములేమిలెక్క వే
దాంతముగాదె నీమహిమ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 98

టీ. శబరియెంగిలిన్ = శబరి కొఱికి చవిచూచుటచే ఎంగిలియైన పండ్లను, కొంటివి = తీసికొంటివి (భక్షించితివి) ఎంతటిపుణ్యమో = అది చేసికొన్న పుణ్యము ఎంత అతిశయించినదో, వింతకాదా = ఇది ఆశ్చర్యముగాదా, (దేవతలు ఇచ్చునట్టి శ్రేష్ఠపదార్థములను గ్రహింపని నీవు, అల్పురాలైన శబరి ఎంగిలిని తినుట చూడఁగా దాని పుణ్యము మిక్కిలి యాశ్చర్యమైనదనుట) నీమంతనము = నీరహస్యము (నీకు వుడుతమీఁద ప్రీతి అతిశయము కలుగుటకు రహస్యము) ఎట్టిదో = ఎటువంటిదో, వుడుతమైని = వుడుతదేహమున, కరాగ్ర = చేతికొనయొక్క, నఖ + అంకురములన్ = గోటికొనలచేత, సంతసమునందన్ = సంతోషపడునట్లు, చేసితివి = గోళ్ళతో నివిరి వుడుతను సంతోషపెట్టితివనుట, సత్కులజన్మములు = మంచివంశంబున పుట్టుకలును, ఏమిలెక్క = నీకేమిలక్ష్యము (నీవు వంశమును, జాతిని పాటింపవు అనుట) నీమహిమ = నీమహాత్మ్యము, వేదాంతముగాదే = వేదాంతమేకదా, నీమహిమచే జాతిని, కులమును జూడక రక్షించునట్టివాఁడ వైతివని భావము.

తా. శబరియెంగిలిని తింటివి. అది యెంతటి పుణ్యముచేసికొన్నదో ఆశ్చర్యముగా నున్నది. వుడుతమైని మునిగోళ్ళతోఁగీఁటి సంతోషపెట్టితివి. దానిపై నింతవాత్సల్యము కలుగుటకు రహస్యమేమో తెలియకున్నది. విచారించిచూడఁగా నీవు జాతిని, కులమును పాటించువాఁడవుకావు, ఓనా నీ మహాత్మ్యము వేదాంత ప్రతిపాద్యమగునంత విస్తారమైనది, కాన నీరక్షణమునకును, శిక్షణమునకును కారణములు మముబోటులకు తెలియవు.

ఉ. బొంకనివాఁడెయోగ్యుఁ డరి ♦ బృందములెత్తినచోటజివ్వకున్
జంకనివాఁడెజోదు రథ ♦ సంఖ్యన నర్థి కరంబుసాఁచినం
గొంకనివాఁడెదాత మిముఁ♦గొల్చి భజించినవాఁడెపో నిరా
తంకమనస్కుఁడెన్నఁగను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 99

టీ. బొంకనివాఁడె = అబద్ధము చెప్పనివాఁడే, యోగ్యుఁడు, అరి బృందములు = శత్రుసమూహములు, ఎత్తినచోటన్ = దండెత్తి వచ్చిన యెడల, జివ్వకున్ = యుద్ధమునకు, జంకనివాఁడె = వెనుకతీయనివాఁడె జోదు = యోధుఁడు, రథసంఖ్యన్ = వేగముగా, అర్థి = యాచకుండు కరంబు = చేతిని, సాఁచినన్ = చాఁచఁగా, గొంకనివాఁడె = ఇచ్చుటకు మిణకరింపనివాఁడె, దాత, మిమున్ = మిమ్ము, గొల్చి = సేవించి, భజించిన, వాఁడె = ధ్యానముచేసినవాఁడే, నిరాంతక = ఆతంకము లేని, మనస్కుఁడు = మనస్సుకలవాఁడు, (నిన్ను గొలిచినవాని మనసే నిర్మలముగా నుండునని భావము.)

చ. భ్రమరము కీటకంబుఁగొని ♦ పాల్పడి ఝుంకరణోపకారియై
భ్రమరముగా నొనర్చునని ♦ పల్కుటఁజేసి భవాదిదుఃఖసం
తమస మెడల్చి భక్తిసహి ♦ తంబుగ జీవుని విశ్వరూప త
త్త్వమున ధరించుటే మరుదు ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. భ్రమరము = తుమ్మెద, కీటకంబున్ = పురుగును, కొని, పాల్పడి = దానికై పూని, ఝుంకరణ + వుపకారియై = ఝుంకారముచేత వుపకారియై, భ్రమరముగాన్ = తుమ్మెదగా, ఒనర్చునని = చేయునని, పల్కుటఁజేసి = చెప్పుటచేత, (జనులాడుకొనుటచేత) జీవునిన్, భవ = పుట్టుక, ఆది = మొదలుగాఁగల దుఃఖసంతమసము = దుఃఖములనెడి చీఁకటిని ఎడ

లించి=పోఁగొట్టి, భక్తిసహితంబుగన్=భక్తితోఁగూడ, లేక భక్తిజనితంబుగన్ అను పాఠమున (భక్తిపుదయింపగా), విశ్వరూపతత్త్వములన్ = నీయొక్క విరాట్స్వరూపమునలను, ధరించుట = తాల్చుట, ఏమి, అరుదు = ఆశ్చర్యము. (నీతోసమానమైన ఆకారముగల వానినిఁగా చేయుట ఏమివింత) ఒక కేవలజంతువైన తుమ్మెద పురుగును తనవలె తుమ్మెదనుగా జేయుట, లోకమునకు తెలియుచుండఁగా నీవు జీవుని దుఃఖములు పోఁగొట్టి భక్తిని గలిగించి వానికి నీతోడి సారూప్యమును ఒసంగుట ఆశ్చర్యము గాదని తాత్పర్యము.

చ. తరువులుపూచి కాయలగుఁదత్కుసుమంబులు పూజగా భవ
చ్చరణముసోఁకి దాసులకు ♦ సారములౌ ధనధాన్యరాసులై
కరిభటఘోటకాంబర ని ♦ కాయములై విరజానదీ సము
త్తరణ మొనర్చుఁ జిత్రమిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 101

టీ. తరువులు=చెట్లు, పూఁచి=పుష్పించి, కాయలగున్ = కాయలు కాఁచును, తత్ + కుసుమములు=ఆపూవులును, పూజగా= (కోసి) పూజార్థముగా, భవత్ + చరణము = నీపాదమును, సోఁకి=తాకి, దాసులకు = నీ భక్తులకు, సారములు = శ్రేష్ఠములు, ఔ ధనధాన్యరాసులై = అగునట్టి ధనధాన్యముల కుప్పలై, కరి=ఏనుఁగులు, భట=బంట్లు, ఘోటక=గుఱ్ఱములు, అంబర=వస్త్రములు, వీనియొక్క, నికాయములై=సమూహములై, విరజానదీ = పరమపదము ఎల్లగానుండు విరజ అను ఏటిని, సముత్తరణము = దాటుటను, ఒనర్చున్=చేయును, ఇది = నీపాదములు సోఁకిన పూలు, చిత్రము=ఆశ్చర్యము.

తా. రామా! చెట్లయందలి పూవులు అట్లే యుండినయెడల కాయలగును. వానినే కోసి నీపాదములయందు పూజార్థము సమర్పింపగా అవి

నీయడుగుల సోఁకఁగానే మేలైన ధనధాన్యములు, ఏనుగులు, బంట్లు, గుఱ్ఱములు, వస్త్రములు మొదలైనవిగా ఇహలోకమున పరిణమించి పరమపదమును కలిగించును.

ఉ. పట్టితి భట్టరార్యగురు ♦ పాదములిమ్మెయి నూర్ధ్వపుండ్రముల్
పెట్టితి మంత్రరాజ మొడిఁ ♦ బెట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ మీచరణ ♦ కంజములందు దలంపు పెట్టి పోఁ
దట్టితిఁ బాపపుంజముల ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 102

టీ. భట్టరార్య గురుపాదములు = గురువులగు భట్టరాచార్యులవారి యొక్క పాదములను, పట్టితిన్ = చేపట్టితిని (వారి శిష్యుఁడనైతిని) ఈ మెయిన్ = ఈదేహమున, ఊర్ధ్వపుండ్రములు = తిరుమణి శ్రీచూర్ణములను, పెట్టితిని, మంత్రరాజము = మంత్రశ్రేష్ఠమయిన, తిరుమంత్రమును, ఒడిబెట్టితిన్ = గ్రహించితిని, దానిచేత అమయకింకరాళికిన్ = ఆయమదూతల సమూహమునకు, బొమ్మన్, కట్టితిని = జయించితిని, మీచరణకంజములందు = మీపాదారవిందములయందు, తలంపుపెట్టి = మనస్సునుంచి, పాపపుంజములన్ = పాపసమూహములను, పోన్ + దట్టితిని = పోవునట్లు ఎగఁజిమ్మితిని.

తా. భట్టరాచార్యులవారి శిష్యుఁడనై తిరుమణి శ్రీచూర్ణములు ధరించి, తిరుమంత్రము పఠించుచు, నరకము తొలగించుకొని మీపాదారవిందములను ధ్యానించుచు, పాపములను పోఁగొట్టుకొన్నవాఁడనైతిని.

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ ♦ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్ల కులోద్భవుండన బ్ర ♦ సిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచి ♦ యించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 103

టీ. జగద్వల్లభ = జగన్నాథా! లింగమంత్రిసుతుఁడు = లింగమంత్రి కొడుకు, అత్రిజగోత్రజుఁడు = ఆత్రేయగోత్రముగలవాఁడు, ఆదిశాఖ = ఋగ్వేదశాఖవాఁడు, కంచెర్ల కులోద్భవుఁడు = కంచెర్ల కులమునఁ బుట్టినవాఁడు, అనఁగ=అనగా, ప్రసిద్ధుఁడనై, భవదంకితంబుగాఁగ = నీకు అంకితముగా, ఎల్లకవుల్, నుతింపఁగ = పొగడఁగా, రచియించితిని = ఈశతకము చేసితిని, గోపకవీంద్రుడఁ=గోపకవిశ్రేష్ఠుఁడను, నీకుఁ దాసుడను.

తా. రామా! నేను లింగమంత్రికుమారుఁడను, నాది ఆత్రేయ గోత్రము, ఋగ్వేదముశాఖ, కంచెర్లకులము, పేరుగోపకవి, నీకు దాసుడను, కవులందఱును పొగడునట్లుగా ఈశతకము రచించి నీకు అంకితము చేసితిని.

సంపూర్ణము.

---

